శ్రీరస్తు.

# పూర్వశాకుంతల నాటకము.

శ్రీశ్రీశ్రీ మహారాజకుమారి సాహెబా శ్రీమదప్పలకొండయాంబా

రీవామహారాణిగారిచే సంపోషితుఁడును, శ్రీమద్విజయనగర

రాజకీయ సంస్కృతపాఠశాలాసాహిత్యవిద్యోత్తమ

మహోపాధ్యాయులు నగు

బ్రహ్మశ్రీ పేరి కాశీనాథవిద్వత్కవిచేఁ

ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1926.

# పూర్వశాకుంతల పీఠిక.

---

స్వస్తి:— శ్రీమదాంధ్రభాషాభిమానులగు సుజనుల సన్నిధిని:— ఆర్యులారా! కావ్యములు దృశ్యములని శ్రవ్యములని ద్వివిధములు. ఇందు దృశ్యములు నాటకములు. ఇవి హితప్రవృత్తిఁజేయుట కనుకూలములు. మన యాంధ్రములో నింతదనుక పూర్వులగు తిక్కనసోమయాజి ప్రభృతులు ప్రబంధములఁ జేసిరే కాని నాటకములఁ జేయలేదు. ఈలోటుఁ దీర్చ మాన్పుటకు మన వారు కొందఱిప్పుడు సంస్కృతనాటకముల నాంధ్రీకరింప దివిరినారు. కాని భాషాంతరీకరణమున మూలమునందలి యర్థము సమగ్రముగాఁ దేటపడుటలేదు. కావున నచ్చమాంధ్రభాషయందే నాటకముల రచించిన మంచి దని తలంచి దీనిని వ్రాసితిని. ఇది యేడురంకములయిన పరిమితమగు నాటకము. ముఖసంధ్యాదులను పతాకాదులగు తదంగములతోను ఇది కూర్పఁబడినది. ఈనాటకము నీతిబోధకము కావున భారతాదిపద్యములు నాల్గయిదు స్వల్పమార్పులతో నిందు కూర్పఁబడినవి. బాల్యవివాహాదులగు నూత్నవిషయము లయ్యెపాత్రలద్వారా సువిమృష్టములై యిందు జొప్పఁబడినవి. ఇందలి యితివృత్తము శకుంతలాజన్మగాథకు సంబంధించినది. దీనిని వలయు మార్పులతో నాకుఁదోఁచినరీతిని ఇందు పొందుపఱిచితిని. అందందు సందర్భానుసారముగా ప్రాకృత సంస్కృతభాషామయములగు శ్లోకములు కూర్పఁబడినవి. ఇవి యంతయును పాఠకుల చిత్తములకు ఆనందమును గూర్చునవే యై యున్నవి. భ్రమప్రమాదాదుల నిందుబొసంగిన దోషముల మన్నించి దీనియందలి గుణములనే గ్రహింపఁ బ్రార్థించుచున్నాఁడను. మఱియు ఈనాటకమును నేను తొల్త ముద్రించినప్పుడు అనవస్థాదోషమునకు గుఱియై ముద్రణమును

చక్కగా వెలువరింపఁజాలనైతిని. ఇయ్యది యిట్టులుండఁ గారణాంతరమున బ్రహ్మశ్రీ. తిరుపతి వేంకటేశ్వరకవు లిద్దానిని తీవ్రముగా విమర్శించిరి. వారి విమర్శనము నాకు మార్గదర్శకమై గ్రంథమును సవరించుకొనుటకు తోడ్పడుటచేత వారియెడల సర్వదా కృతజ్ఞత వహించియున్నాను.

ప్రకృతము ఈనాటకము ప్రథమముద్రణము ముగిసి ద్వితీయవారము ముద్రితము గావలసియుండుటచేత శ్రీమచ్చెన్నపురి వాస్తవ్యులగు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారికి దీనిముద్రణాధికారముల నన్నింటి నొసంగి నాకు తోఁచినరీతిని గ్రంథమును సొంతముగా మార్చియుఁ గూర్చియు నిచ్చితిని. ఈముద్రణమునందును ఏవేని లోపములు కల్గినచో విజ్ఞులు క్షమింపగాఁ బ్రార్థితులగుచున్నారు. ఇదియ నాచేయువిన్నపము.

విజయనగరము.

ఇట్లు,

పేరి కాశీనాథశాస్త్రి.

# ప్రకాశకుల విజ్ఞప్తి.

---

శ్రీశాస్త్రులువారు ఈగ్రంథమును సవరించి చిరకాలము క్రిందటనే మాకిచ్చినను మేము అవకాశము లేకుండుటచే నింతదనుక మఱల ముద్రింపఁజాలమైతిమి. ఇప్పు డీముద్రణము వెలువడుటకుముందే శ్రీవారు కీర్తిశేషు లయినందులకు విచారించుచు వారి సంస్మరణార్థము దీని నిపుడు ప్రకటించితిమి.

ఇట్లు ప్రకాశకులు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# పూర్వశాకుంతలనాటకము.

---

## పాత్రవివరణము.

| | | |
|---|---|---|
| ౧ | విశ్వామిత్రుఁడు | కథానాయకుఁడు. |
| ౨ | త్రిశంకువు | సూర్యవంశపురాజు. |
| ౩ | లావణ్యలహరి | ఒకబ్రాహ్మణకన్య. |
| ౪ | కనకాంగి | లావణ్యలహరిచెలికత్తె. |
| ౫ | వసిష్ఠమహర్షి | సూర్యవంశజులకు పురోహితుఁడు. |
| ౬ | విదూషకుఁడు | రాజువద్ద హాస్యముచెప్పెడిబ్రాహ్మణుఁడు. |
| ౭ | ఇంద్రుఁడు | స్వర్గాధిపతి. |
| ౮ | జయంతుఁడు | ఇంద్రునికొడుకు. |
| ౯ | బృహస్పతి | ఇంద్రునిమంత్రి. |
| ౧౦ | బ్రహ్మ | సృష్టికర్త |
| ౧౧ | నారదుఁడు | బ్రహ్మకొడుకు. |
| ౧౨ | మేనక | కథానాయిక. |
| ౧౩ | చిత్రలేఖ | మేనకచెలికత్తె. |
| ౧౪ | యజ్ఞదత్తుఁడు | విశ్వామిత్రునిశిష్యుఁడు. |
| ౧౫ | కణ్వుఁడు | శకుంతలను పెంచిన మహర్షి. |
| ౧౬ | వృద్ధగౌతమి | కణ్వునిభార్య. |
| ౧౭ | శార్ఙ్గరవుఁడు | కణ్వునిశిష్యుఁడు. |
| ౧౮ | సిద్ధయోగిని | ఒకతాపసురాలు. |
| ౧౯ | దాల్భ్యయనుఁడు | లావణ్యలహరి సోదరుఁడు. |

*N. B.* ఇవిగాక మఱికొన్నిపాత్రలుగూడ సందర్భానుసారముగా వచ్చుచుండును.

# పూర్వశాకుంతలనాటకము.

---

## ప్రథమాంకము.

### నాంది.

ఉ. ఇందిర డెందమందును రవీందులు గన్నులనుండ నందమౌ
ముందుగ మందహాసమున మోమునఁ గ సుందరుఁడెందునుండు
గోవిందుఁడు ధాతనాభియరవిందమునం గనువాఁడు కృ
ష్ణుఁ డానందమయుండు సభ్యుల కనంతసుఖంబుల నిచ్చి
ప్రోవుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి.)

సూ:—విస్తరించి చాలు నిఁక. శ్రీమదఖిల భువన మహనీయ కమనీయ సుగుణగణ వర్ణనీయాద్భుతచరితుఁడును, నిశాచరపతి పరిభవదుర్భర భూభారహరణ కరుణావతారనిపుణుఁడును, ఋష్యశృంగ చరుతరుపరిణతఫలభూతుఁడును, త్రినయనధనుర్భంగ శుల్కప్రసంగాంగీకృతాయోనిజాంగనాలింగితుఁడును, సౌందర్యవిజితానంగుఁడును, కౌశిక మఖసంరక్షమారీచ ప్రముఖ దుష్టశిక్షణ ధురీణుఁడును, రవికులజలధిచంద్రుఁడు నగు శ్రీరామచంద్రుని లీలామహోత్సవసందర్శన కుతూహలమున నేతెంచిన యీసభాసదుల నేడేనొక నవీననాటకముచే నానందింపఁజేయఁదలంచి, ఈ విజయనగరరాజధానిఁ బ్రవేశించినాఁడను. (స్మృతి నభినయించి, విషాదముతో) అయ్యయో! సకలకళాప్రవీణుఁడగు శ్రీమదానందగజపతిమహారాజు స్వర్గతుఁ డగుటంజేసి,

పండితసంరక్షణమును విద్యావినోదము లేని యీపట్టణమున కేల వచ్చితిని?

నటుఁడు:—(ప్రవేశించి) ఈవార్త ఇంకను మీకు స్పష్టముగఁ దెలియలేదా? శ్రీపూసపాడ్వంశమును మఱల నంకురింపఁజేయఁదలఁచి, శ్రీమద్విజయరామగజపతిమహారాజనామధేయమున వెలయుచున్న పుత్త్రరత్నమును సింహాసనాధికృతుఁజేసి, శ్రీమద్విజయరామగజపతికుమారికయును, శ్రీమదలకాంబాగర్భశుక్తిముక్తాఫలంబును నగు శ్రీమదప్పలకొండయాంబామహారాణి యథాపూర్వముగఁ బండితపరిపాలనమును విద్యావినోదమును చేయుచు యుక్తముగఁ బరిపాలించుచున్నది.

సూత్ర:—మంచిమాట చెవిఁ బడినది. మహారాజపుత్రికయగు నా మహారాజ్ఞి చిరకాలము వృద్ధిఁ బొందుఁగాక!

నటు:—సంస్కృత ప్రాకృతాంధ్రాది సకలభాషలందును మనము ప్రవీణుల మయ్యు నిట నాంధ్రదేశ మగుటచే నీదేశభాష నొనరించిన నాటకము నేదానినేని ప్రయోగించుట యావశ్యకమని తోఁచుచున్నది. ఏమన:—

క. తనదేశవేషభాషల
నొనరించెడినాటకంబు • లొల్లక పెరలన్
వినుటన్య వేషభాషణ
మును నరునకు మూఁగపాలతి•పొత్తును బోలున్.

సూత్ర:—అటులైన నీసభాసదులయుల్లంబులు సంతసిల్లఁజేయఁగల సాధనసంపద యలవడినచో ప్రశస్తముగా నుండును.

చ. సుగుణగణాకరంబు సభ•సొంపు; సుధామధురంబు నాటకం,
బగణితమైన వ్యంగ్యమున•కాస్పద మాపదగుంఫనంబు, శ్రీ

భగవదనంతదివ్యకథ • భాసుర మిచ్చుట నాదు వర్గముర్
మిగులఁ బ్రవీణమాటలను• మెప్పగుమాటలమంచిపాటలన్.

(ముందునకు దృష్టి సారించి) బావా! శ్రీరామచంద్రుని లీలాదర్శన సముత్సుకులై పరస్పరాలాపపరవశులగు సభాసదులకు నాభిముఖ్యంబుఁ గల్పించు నుపాయమెద్దియో తోలుతఁ దోఁచకున్నది.

నటు:—ఇంత విచారింపనేల? సరససంగీతపేటి యగు నటిచే సంగీతకముఁ గావింపఁజేతము. అదియే రంజకమై సభకాభిముఖ్యంబును గలుగం జేయును.

సూత్ర:—చక్కఁగ నూహించితివి. ఏమందువా?

క. అంతటఁ జెల్లు వివేకం
బంతట నౌ జపము తపము • నల శూరత్వం
బంతట మానము ధ్యానము
నెంతటఁ దమకనులఁ బడదో • యింతు లిదియ మేల్.

నటు:—అటులైన నటి నిటు పిలచెదను. (తెరవైపు మఱలి) ఓ సుందరీ! నీయలంకారవిధానము పూర్ణమైనచో నొకమారిటు రావలయును.

నటి:—(ప్రవేశించి వినయమున నొదిగి యుండును.)

సూత్ర:—(నటిని చూచి) ఆహా! నటి వచ్చినదే!

క. అంగీకృతపదకటక ము
హాంగీకృతవంశి, సుంద• రాంగయుఁ బ్రీతిక్
రంగమునఁ బాడఁ దివిరిన
సంగీతము, భృంగినాఁగ • సభ రంజిల్లున్.

నటి:—ఆర్యా! చేయఁదగినకార్యమేదియో యాజ్ఞాపింప వలయును

సూత్ర:—సుందరీ! సకలకళాప్రవీణమగు నీసభ నేడేనొక క్రొత్తనాటకమును ప్రదర్శించి యానందింపఁజేయఁ దలఁచితిమి. కాన నీవేదే

నొక ఋతువు నధికరించి సంగీతకముఁ జేయుము. ప్రస్తుత మింతకన్న

నటి:—అట్లే; కాని ఆర్యా! ఏఋతువు నధికరించి గానము సేయవల యునో తెలియఁ జేయుఁడు.

సూత్ర:—(పురోభాగమునకు దృష్టిసారించి) మిక్కిలి సంపదగలవారు నమ్రులై యిట్లుందురని వ్యక్తముసేయునటులఁ బరిపక్వఫలభారమునఁ దలలు వాంచియున్న సస్యములు నిండిన కేదారములు గలదియును, మెల్లమెల్లన వీచు చల్లనిగాలిచే గదలి రాలిన నెత్తమ్మిపుప్పొడుల పరిమళముగల సరోవరవిలాసములు గలదియును, అతివిమల హిమకర కిరణ ధవళిత నిశాభాసురములును నగు నీ శారదవాసరముల నధికరించి గానముఁ జేయుము.

నటి:—చిత్తము. అటులనే (అని పాడుచున్నది.)

క. చకిత సలిలావగాహులు
 వికసిత పంకేజరాజి • వేల్లిత వేణీ
 సుకుమారసుందరాంగులు
 సుకుసుమ తైలావలిప్త•సురభిత దేహుల్.

సూత్ర:—ఆహా! సుందరీ:—నీగానమాధుర్యమునఁ బరవశమై సభ చిత్ర లిఖితమువలె నైనది. ఇక నీవిటుపైఁ జేయఁదగిన పనులకై త్వరపడ వలయును.

నటి:—చిత్తమట్లే! (అని నిష్క్రమించుచున్నది.)

నటు:—ఆర్యా:— యుక్తాయుక్తములను వివేచించునదియై, నవరసభరి తమై వినినకొలఁది సభ్యుల చిత్తమునకు రంజకమై యొప్పు నొకనా టకముఁ బ్రయోగింపవలయునని సభ్యులు కోరుచున్నారు.

సూ:—(ఆలోచించి) అట్టి గుణవంతమగు నాటక మెదియై యుండును? (స్మృతికిఁ దెచ్చుకొని) ఆ! స్మృతికి వచ్చినది. పవిత్ర గౌతమ

గోత్రోద్భవుండును, శ్రీరామచంద్ర దయాపాత్రుండును నగు శ్రీమ త్పేరికులజలధిచంద్ర మహోపాధ్యాయ వేంకటశాస్త్రిపుత్ర శ్రీకాశీ నాథవిద్వత్కవిచే రచింపఁబడి, మనకు ప్రదర్శనార్థ మీయఁబడిన పూర్వశాకుంతల మను నాటక మున్నయది. అద్దాని నిపుడు ప్రయో. గింపఁ దగును.

నటు:—బావా! పూర్వకవికలితనాటకముల నతిక్రమించి వర్తమానకవికృతియం దనురాగ మెటులఁ గల్గును?

సూత్ర:—ఏవస్తువేని ప్రాచీనమన్నంతనే పరిగ్రాహ్యము కాఁజాలదు. నూత్న మనినంతనే విడువఁదగియదు నుండరాదు. మఱి కవితాలతాయువతులు నచ్చోత్కలికాకుల లైనచోఁ గ్రొంగ్రొత్తలే గ్రాహ్యములు గదా!

నటు:—(పురోభాగముం జూచి) బావా! చూడుఁడు. అల్లదె గ్రహరాజు ధాటికి నోర్వఁజాలక యీ ద్విజరాజు వెలవెల్ల నగుచున్నాఁడు.

సూత్ర:—ఓహో:—వసిష్ఠుఁడు విశ్వామిత్రునిధాటి కోర్వఁజాలని ప్రకృత కథ సూచితమా! అయిన నిటుపైఁ జేయఁదగు పనులకై త్వరపడఁ దగును. (అని యిర్వురు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

{ దండధరమగు పరిజనముతో త్రిశంకు విశ్వామిత్రుల ప్రవేశము. }

త్రిశం:—(ప్రక్కకుఁ జూచి) మిత్రవర్యా! విశ్వామిత్రా! ప్రాకృతములగు సాత్త్విక రాజస తామస గుణములచే నుత్తమ మధ్యమాధమ భావంబులఁ బొదియగు ధర్మార్థకామమోక్షరూప చతుర్విధ పురుషార్థములకు ననుకూలముగఁ బ్రవర్తించుచు నరిమిత్రోదాసీన ద్వాదశ రాజమండలమును స్వామ్యమాత్య సుహృత్కోశాదులచే ధర్మాయత్తముగ భూమిఁ బాలించిన భూపతి సద్గతిం జెందుఁగాదె!

విశ్వా:—నిజము. నీవు చెప్పినవి క్షత్రియులకు విశేషధర్మములు. ఇంతియ కాక -

చ. అతిథుల దీనకోటుల క్షుధార్తుల లేని యతివ్రజంబు స
మ్మతిఁ బరికించి హర్షమున మానవిషాదములన్ జొరంగనీ
క తొలఁగఁద్రోసినారయెడలు గానక భూప్రజఁగాతునన్ వివి
శ్చితదృఢబుద్ధి దేవగురు సేవలు సేయుట శేషధర్మముల్.

త్రిశం:—వెలఁది పానంబు జూదంబు వేఁట—యను నీనాలుగు నుత్తరోత్త
రముగ బలిష్ఠములైన వ్యసనము లండ్రు. కావున మతిమంతుఁడగు
రాజు అవ్వానికి లోఁబడక యుండవలయు ననుట వినమే. ప్రకృతము
మన మేకతమున వేఁటకై వనమును ప్రవేశించుచున్నారము కదా!

విశ్వా:—ఓయీ మిత్రవర్యా. నీచెప్పినవానిలో రెండు వ్యసనములు. అయి
నను -

క. ప్రతికార్యసముత్సాహద
మతిఖిన్నమనంబునందు నానందపమహా
ధృతి వేఁట యొసఁగుఁ బానము
క్షితిలో లేకున్న నరుఁడు గీడొందు నృపా!

ఉ. వేఁటకు సాటియేది? యిట వీర్యము శౌర్యము ధైర్య
మొప్పు ని, చ్చోటను మాటునుండి గుఱిఁ జూచియు
వ్రేయు శరంబు దాఁక న, గ్గాటపుఁ బాటునన్ బడు మృ
గంబుల హింసకు హేతువుం దపః, కోటిఫలంబు రాజు
లకుఁ గూర్మియు వేఁటయ గాదె భూవరా!

త్రిశం:—అయిన నొకపలు కడ్డు నుడువ నోడెద. దాని లెస్సఁ బరికింపుఁడు.
పానము యుక్తాయుక్తవివేకముఁ బోగొట్టి మతిభ్రంశముఁ గలుగఁజే
యుఁగదా! మఱియు నిందు -

చ. తిరిగి మహాటవిం గలుగు ♦ తిండి బలిష్ఠతఁ బెందు జంతువె
త్తెరువుఁ దలంపకేమియు మ♦దిన్ వడిఁ బ్రేయు శరంబు దాఁక
న, మ్మరణము దాని ; కయ్యదియు ♦ మార్గముఁ దప్పిన వా
నికే కదా!, యరయఁగ నాత్మహింసయని ♦ యార్యులు.
వేఁట గణింపరింతయున్.

విశ్వా:—ఈ చెప్పఁబడినవానిలో నతిప్రసంగమున్న నే వ్యసన మనంబడును. చూడుము. దాన మెంతటి ప్రశస్తతఁ గాంచినను నం దతిప్రసక్తి నూనినందున బలి యధోలోకమునం (బాతాళమునం) బడెను. ఇటు లనె కామాదులయందు నతిప్రసంగమునకుఁ బాల్పడి కూలినవా రెం దఱెందఱో గలరు. కావున దర్శనస్పర్శనాదులమాత్రమున మత్తులం జేయు వెలది పానము మున్నగు వ్యసనములందును నతిప్రసంగమే చెఱుపునకుఁ గారణము. (ముస్ముందు పరికించుచు) ఓయీ! మిత్రవర్యా! చూడుమిమ్మహారణ్యము ఒకచో మహావాసి హేషారవశ్రవణ భీత మహిషఖుర నివహ పాటిత మహీరజఃపుంజ పింజరమును, పంజాలకులాయపంజర శుకపికాది రవరంజితమును, వేఱొక్కచోట సంతతసమిధ్యమాన హుతవహాపరిణతాజ్యగంధ సుగంధిసమీర బంధురాశ్రమ సంకులమును నై మనంబున కానందమమందముగఁ జేయుచున్న యది.

త్రిశం:—(వేఱొకవంకఁ జూపుచు) ఈ వంక బరికింపుఁడు. ఇటుఁ బల్వల సంకులములును ఘుర్ఘురధ్వనులుగలవియునై వచ్చుచున్న వనవరాహము లున్న దెసకు తద్గంధానుసారములై దారితప్ప నీడ్చికొనిపోవుచున్న కుక్కలను బల్మిని పట్టియున్న మనయనుయాయి వర్గము కన్పట్టుచు న్నది. ఇదిగో నీవైపునుండి దుర్గంధమును వ్యాపించుచున్నయది. ఇది గో ఇయ్యదియే వ్యాఘ్రాదులున్నస్థలము కానోపు నిట కాసరసమూ

హాము పరువెత్తి వచ్చుచున్నయది. అన్నన్నా! ఒక్కత్రుటికాలములో నీయరణ్యమంతయు ముట్టడియైనది. అదె ఆరణ్యకుల కోలాహలము మిగుల భయమును గొల్పుచు వినవచ్చుచున్నయది. (సైనికులంజూచి) దండధరులారా! మీరు దూరముగఁ బోయి క్రూరజంతువుల ముట్టడించుటలో జాగరూకులై వర్తింతురుగాక.

పరిజనము:—జయము. మహారాజా! అటులనే. (అని నిష్క్రమించెదరు.)

త్రిశం:—(ఆకసముంజూచుచు) అరరే! ప్రచండుఁడై మార్తాండుఁ డెండఁ గాయుచున్నాఁడు. ప్రొద్దు చాల గడచినది. ఆఁకలియుఁ దీక్ష్ణముగ నున్నది. కావున నెయ్యెడనైన నొకదండను విశ్రమించి యుందముగాక.

విశ్వా:—ఓయీ! పరమసఖా! నీవిచ్చటన నుండుము. నేనుపోయి వెదకి యెచ్చటనేని మృగమాంసముఁ గొనితెచ్చెద. అంతదనుక నీవీ వకుళవంజుళ తరు గహనాంతరమగు లతామండపమున విశ్రమింపుము.

త్రిశం:—అటులనె. నీరాకఁ బ్రతీక్షించి యుండెద.

విశ్వా:—నేను నిదె పోయి వెన్వెంట వచ్చెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

త్రిశం:—(క్షుధార్తతను సూచింపుచు మెల్లమెల్ల రెండడుగులు పెట్టి అంతలో విస్ఫారితనేత్రముల ముందుకుఁ బఱపి)—ఆహాహా! అల్లదె యెవ్వరో యొకసుందరాంగి యందమై కనువిందొనర్చుచున్నయది. అచ్చటికిఁ బోయి విశ్రమించెదఁగాక (అని మఱికొంతదూరము నడచి) ఆశ్చర్యమాశ్చర్యము!!

పున్నమజేయు చందురునిఁ ♦ బోలు మొగంబు, నగంబులైతగుం, జన్నులు సన్నమౌ నడుము ♦ సన్నుతులౌ మెయివన్నెగల్గియు, కన్నులు చారెడేసి రతి ♦ కన్నను మిన్నగు

చున్న కన్నెయో?, తిన్నఁగఁ గన్నులారఁ గను♦ త్రిప్పిన లో
కజయంబు గాదొకో!

(మెల్లనఁ జెంతకుఁ జేరి) ఓసుందరీ!

ఉ. ఎందులనుండి వచ్చితిట ♦ నెందుకు నొంటిజరించెదీవు నిం
పొందఁగ మందహాసమునఁ ♦ బొంకకపల్కుము సుందరాం
గి! నీ, కందమె! కుంద డెందమున ♦ నయ్యయొ యెవ్వత
వెండ వేడిమిఁ, మందుఁడనై తి వచ్చితిని ♦ మన్నన నన్నిట
గారవింపుమీ.

(లావణ్యవతి కనకాంగియనుసఖితో భాషించుచుఁ బ్రవేశించుచున్నది.)

లావ:—(ప్రక్కనుఁ జూచి) కనకాంగీ! రూపరేఖావిలాసములచే నీతం
డు త్తమక్షత్త్రియకులమందు బుట్టిన మహారాజుఁ బోలి యున్నవాఁడు.
ఏనామమువాఁడో యేదేశపు ప్రజ లీయనచే రక్షితులగుచుందురో,
ఇవ్వనమున కేమినిమిత్తమున వచ్చియున్నవాఁడో కదా!

కన:—(లావణ్యవతితో) సఖి లావణ్యవతీ:- అడిగినచో నీతఁ డీసంగతి
విస్పష్టముగఁ జెల్పుననుకొందును. అడిగెదఁ గాక. (త్రిశంకువు వైపు
నకు మఱలి) ఆర్యా! తామెవ్వరో ముందుగ సెలవీయఁ గోరెదము.
పిమ్మట వృత్తాంతమునుకూడ సవిస్తరముగ ఆర్యులసన్నిధిని చెప్పి
కొందుము.

త్రిశంకు:—(స్వగతము) ఆహా! సవిస్తరమని యనుటచే నీమెచరిత్రము
చాల గలిగియుండుననుకొందును. కానిమ్ము. మున్ముందు మావృత్తాం
తము నే చెప్పెద. (ప్రకాశముగా) సుందరీ! నన్నుఁ ద్రిశంకురా
జుఁగా నెఱుంగుఁడు. మామిత్త్రుఁడగు విశ్వామిత్త్రునితో నడవికి వేఁట
కై రాఁగ, మార్గాయాసఖిన్నుఁడనై కొంతతడ విట విశ్రమించితిమి.
ఇఁక మీరుఁ జెప్పవచ్చును.

లావణ్య:—మావృత్తాంతము జెప్ప నలవికానిది. అయినను రాజు సర్వులకును బంధుసామాన్యుఁడగుటంజేసి, గృహచ్ఛిద్రమై ప్రకటింప వీలు లేనిదైనను మీసన్నిధిం జెప్పఁగావచ్చునని తలంచితిమి. కావున నవధరింతురుగాక.

త్రిశంకు:—సావధానుఁడను.

లావణ్య:—ఆర్యా! కుసుమపురమను పట్టణమున దీర్ఘతపుఁడను విప్రోత్తముఁడొకఁడు గలఁడు. ఆవిప్రునకుఁ గలహప్రియయను పేరుగల ధర్మదార కలదు. ఆమెయం దావిప్రునకుఁ దొమ్మండ్రు పుత్త్రులు పుట్టిరి. పుత్రికలును నందఱే. అటుతర్వాత నా విప్రోత్తముఁడు దారిద్ర్యపీడితుండై గృహమున నుండుట తపోనిష్ఠకు భంగమని తలఁచి, నిజభవనసుతాదుల వీడి వనములకుఁ జనియెను.

త్రిశంకు:—[స్వగ] ఆహా! అవ్విప్రునకుఁ గుటుంబబాహుళ్యమే తొలుత నవంతమగు దారిద్ర్యము. ఆపైనిఁ దపశ్చర్య యెటు లలవడఁగలదు? [ప్రకాశముగా] సుందరీ! తపశ్చరణశీలురగు నుత్తములకు వనముల నుండుటయే రుచికరము కదా!

క. గృహములనుండిన దుష్కృతి
బహుళక్లేశముల మిగుల ♦ బాధితు లగుచున్
గహనమున కేఁగి శాంతత
విహరించినఁ బరమపదము ♦ వేగను బొందున్.

లావ:—[మఱల నుపక్రమించి] అంత నాతని ధర్మదార తమ పుత్రులకు వివాహములఁ జేయుటకై తమపుత్రికలను శుల్కముపుచ్చుకొని విక్రయించి యాద్రవ్యమునఁ బెండ్లిఁ జేయ నారంభించెను.

త్రిశం:—అయ్యయో! ఈయుగధర్మ మిది కానోపుఁ గాని కన్యావిక్రయ మెట్టులఁ జేయఁదలఁచెనో గదా! - ఏమందువా?

శ్లో. ఆదదీత న శూద్రోపి శుల్కం దుహితరం దదత్
శుల్కం గృహ్ణన్ హి లోభేన స్యాన్నరోఽపత్యవిక్రయీ.

అని మనువుచెప్పిన ధర్మవచనము తెలియదా? అయినను దారిద్ర్య మనునది గొప్పదోషముకదా! అయ్యది ఎన్నెన్ని దుష్కృత్యముల నేని చేయింపకమానదు. (లావణ్యవతి నుద్దేశించి) అటుమీఁద నటు మీఁద.

లావ:—సురూపవతి యగునన్ను విక్రయించి దానఁ గనిష్ఠభ్రాతయగు దామోదరునకు వివాహముఁ జేయ నిశ్చయించిన వరుండు వృద్ధుఁడని నే నంగీకరింపక యుక్తవరునిఁ బ్రతీక్షించి యున్నదానను.

త్రిశం:—(స్వగతము) ఈవృత్తాంత మెంతచిత్రముగ నున్నది. [ప్రకాశముగా] అటుపై - అటుపై.

లావ:—[లజ్జచే మోముద్రిప్పి కనకాంగిని చెప్పుమని సూచించుచున్నది.]

త్రిశంకు:—(స్వగతము) ఈకన్యకామణి యాసన్నయౌవన యయ్యును వివాహము లేనట్టులఁ గాన్పించును. ఈయొయ్యారంపు చూపులు ముగ్ధతను సూచించుచు నెంత రమ్యములై యున్నయవి!

సీ. సఖిప్రాయ మఱ్ఱవేఁగు • జాముననందమ్ము
లర్ధంబు వికసించు • ననఁగఁ జెంత
నున్న చంపక నాసి•కొన్నతిఁ గన్గొంచు
వీక్షాళు లొకకొంత • వెఱచు ననఁగ
ప్రాయమఱ బాల్యభవ•పదమందుఁ జనవేది
కైనను నిడఁగ రా•దనఁగ నల్ల
భామిని తొల్లిఁటి•వడి నిప్డుఁ గనుగొన్న
మోహాబ్ధిఁ జూపరి • మున్గుననఁగ

గీ. మాటి మాటికి యువజన•మానసంబు
దొంగిలింపంగ మెల్లనఁ • దొంగిచూచు

నన\(ు\)గ నగుమొగ మట్టుద్రిప్పి • యందముగను
కాంత బలువేడ్క నలుచూడ్కి • గనియె నన్ను.

[మఱియొకమాఱు సవిమర్శముగా నీక్షించి.]

మ. మరుఁడర్క భాస్కరుఁడుద్యమించు నవలా•మై బ్రాయమ
న్వేఁకువన్, ద్వర బాల్యంబను తేయి బోనలరె నా • ద
థ్యంబు ముత్తెంబు వేఁగుఁజుక్క యన మోముదమ్మి
దరి కేఁ•గుం దేంట్లునాఁ గల్గె ముం,గురులంచున్ దలెత్తి
చక్రములు గ•న్గొన్నట్లు వక్షోజముల్.

[ప్రకాశముగా] అటుతర్వాత నేమి జరిగినది ?

లావణ్య:—తరువాతఁ బదుమూఁడువత్సరములు గడచన్నచో వివాహము సేయుట యుక్తముగాదని లోకులు మాగురుల నధిక్షేపించిరి.

త్రిశంకు:—(స్వగ) అన్నా! ఎంతపని జరిగినది. [ప్ర. కా.] మీతలంచినదియే యుక్తము. బాల్యవివాహములే స్త్రీలకు అత్యంతము బాధాకరములు. ఏమన—

చ. కరుణయొకింతలేక ధన•కాంక్షఁ గురూపులు కోపులైన యి
మ్మెఱయక కన్నెలన్ వరుల•కర్పణఁ జేసినఁ బ్రాయమందు వి
స్ఫురితవిభిన్నభావములఁ • బొందక జేసెడి తల్లిదండ్రి బి
త్తరులకు శత్రువుల్ బతియుఁ • దప్పుల నెంచఁగఁజూచు
లోకులున్.

లావ:—ఆర్యా! అట్టికన్య గురుజనుల యాజ్ఞకొడంబడక తనకన్యాత్వమునకు వన్నెవెట్టఁ గోరి యీ మనోహరమగు వనంబునఁ దపమాచరింప వచ్చినది.

త్రిశంకు:—ఎంతక్లేశము. అన్నా!

క. కుందనమువంటి నెమ్మెయి
కిం దగునే తపముఁ జేసి • క్లేశము పడయన్
సుందరి! దుర్ఘటమిది మఱిఁ
గుందక డెందము నమంద•కుతుకంబు దగన్.

లావ:—ఆర్యా! క్లేశములకు జంకక తపమాచరించువారల కిష్టఫలసిద్ధి యౌన్నదియే కాదా!

త్రిశం:—(సవితర్కముగా) ఆ! అవ్విషయమున సందియమే లేదు.

చ. దురధిగమంబు నెద్దియగు•దుస్తరమెద్దియొ దూరమెద్దియో
నరులకు దానిసంతయును•నమ్మిక జేయుఁ దపంబుగాన్పు దా
దరసి గృహంబుఁబాసి మును•లైరి తపంబొనరించి యైన సుం
దరి! తపమే యసాధ్యమగు•దార్ఢ్యము చిత్తమునందు లేనిచోన్.

లావ:—కావున నాతిదూరముగఁ గనఁబడు ఋష్యాశ్రమమునకేగి తపంబొనరించెద. కొన్నియడుగుల శ్రమకు మన్నించి మార్గముఁ జూపవేఁడెద.

త్రిశం:—(స్వగ) ఆఁకటిచేఁ దూలియుంటి, నైనను పరోపకారార్థమేకదా యీశరీరము. అందును ననుఁబోటి సుక్షత్రియున కిది అవశ్యకర్తవ్యము. నా మిత్త్రుఁడు వచ్చునంతకు దారిజూపి వచ్చెదను. (ప్రకాశముగా) సుందరీ! ఇటురమ్ము. ఇటురమ్ము (అనుచు నామెను తోడ్కొని పోవుచున్నాఁడు.)

విశ్వా:—(ప్రవేశించుచు) అక్కటా! వన్యాహారమేనియు లభింపకున్నది. నామిత్త్రుఁడు క్షుధార్తుఁడై మృతిసెందునేమొ కదా! [దిక్కులఁ గలయం జూచి సంభ్రమోద్వేగములతో] ఆహా! ఎంతఘోరకృత్యము జరుగుచున్నది?

ఉ. కావుము కావుమంచు వడి ♦ గద్గదికంబునఁ దొట్రువాఱు
నా, గోవును వత్సవెంటఁబడ ♦ గొట్ట జిఘాంసుఁడు వచ్చు
చుండె గో, సేవన మక్షయోచ్ఛఫల ♦ సేతువు గావున నార్త
ధేనువుఁ, గావఁగఁ బోవువాఁడ నిది ♦ కార్యము రాజున
కార్తరక్షయున్.

(అని యడుగులు దడఁబడ పర్వెత్తుచు, కోపస్వరముతో)

క. ఓరి దురాత్మక విడువుము,
ఘోరపు కృత్యంబు; నందు ♦ గోహత్య సుమీ
స్వైరగతి నున్న ధేను వ
కారణముగ నిటులఁ జంపఁ ♦ గడగితి వేరా?

(అని కోదండమును ఎక్కిడి శరమోచనము సేయ నద్దాన గోవునంగంబు దూసిపోవుటం గని--ఖేదముతో) అక్కటా! ఉపకారముఁ జేయఁబోవ నయ్యది యపకారంబయ్యెఁ గదా! దైవదుర్విపాకము! కానున్నది కాక మానునా?

ఉ. ఘాతుకుఁ జంపి ధేనువును ♦ గావఁగరా యిటగ్గై నిమ్మహా
పాతక, మిద్దివాయఁగ ను♦పాయము దోఁచదు దీనినెట్టు
లం, జేతును జీవితేఁ, గుమతిఁ ♦ జింతలఁ గుందఁగనయ్యె
నయ్యయో, ధాతృలలాటదేశలిఖి♦తంబునుఁ ద్రోయఁగ
వచ్చునే కటా!

(స్వ) ఎంతగ నాలోచించినను నిష్కృతి తోఁచకున్నది. (ఆలోచించి)

క. పాపంబు బుద్ధిపూర్వ
వ్యాపారము గాక దొడవు ♦ నప్పుడు మనుజుం

దేపాటి దాని నంటక
పాపుఁ గొనఁ జాలు బుద్ధిపటిమ గలిగినన్.

కావున నబుద్ధిపూర్వకముగాఁ బొసఁగిన నీపాపమును, దీనిమాంసమును క్షుధార్తుఁడగు త్రిశంకునకొసంగి ఆకలిబాపిన పుణ్యముచే వారించుకొందును. ఇదియ యిప్పటికి నివృత్త్యుపాయము. (దిక్కులం గలయం జూచుచు) నామిత్రుండెందుఁ బోయి యుండెనో కదా! (కొంచెము ఆలోచించి) మిక్కుటమగు నాఁకటిచే మృతినొందియుండునా? (విషణ్ణతతో తలపంకించుచు నంతలో కొంచెము సంతసము నభినయించుచు) ఇదుగో! నామిత్రుండీత్రిశంకు వెచ్చటికో పోయి వచ్చుచున్నటులున్నది. త్వరగ దీని నొసంగెదను. (అనిసమీపించుచున్నాఁడు)

త్రిశంకు:—(విశ్వామిత్రునిం జూచి) మిత్రవర్యా! వచ్చితివా? మిక్కుటమగు నీయాఁకటిచే నిశ్చేష్టుఁడనై యున్నాను.

విశ్వా:—అరణ్యమంతయుఁ దిరిగి వేసారి తుదకెట్టులనో యీయాహారముఁ దెచ్చితిని. దీనిని భక్షించి క్షుద్బాధ నపనయించుకొనుము.

త్రిశంకు:—నీవును పరిశ్రాంతుఁడవే కదా! కావున స్వల్పమాత్రము నిందు భక్షింపవలయును.

విశ్వా:—అటులనే చేయుదము. (అని పరిక్రమింతురు.)

త్రిశంకు:—ఇదిగో! ఇట మృదుల కిసలయాస్తరణ మున్నది. ఇచ్చటఁ గూర్చుండి భక్షింతము. (అనియిర్వురుఁ గూర్చుండెదరు. పిమ్మట సవిచికిత్సితముగా) పరమసఖా! హింస లేకయే మాంసము లభింపదు గదా! అట్లయినచో... న హింస్యాత్సర్వాణి భూతాని, అహింసా పరమోధర్మః—అని ఇత్యాది శ్రుతిస్మృతులచే హింస నింద్యముగాఁ జెప్పఁబడుచున్నదే. బహుకాలము అహింసావ్రతమునూని మాంసముఁ

బరిత్యజించిన నేను-మఱల-నేఁడు - తన్మూలకమగు మాంసభక్షణము నేయవలసివచ్చెఁగదా యని చింతిలుచున్నాఁడను. ఏమిచేయనగును ?

విశ్వా:—(పకపక నవ్వుచు-సోపహాసముగా)

న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే-

యని మనువు జెప్పుట నెఱుంగవా? రాగప్రాప్తమగు భక్షణము స్వాభావికము. మాంసము పితృదేవతలకును ముఖ్యంబు గదా! వాజిమేధాదులగు క్రతువులయందు దేవతలకు నిదియే యర్పితమగును. కావున నియ్యది ఈయుగమున దోషకరము గాదు. అందునను:-

క. ....................చవి యొఱిం
గినవాఁడది యుడిగిన నా
తని దేవసమానులండ్రు ధర్మవిధిజ్ఞుల్.

అనియుఁ బెద్దలు చెప్పుచున్నారు.

త్రిశం:—అయినను, నీనింద్యకర్మమును మాకుఁ గులక్రమాగత పురోహితుండగు వసిష్ఠుండు విన్నచో నాపై నలిగి శపించునేమో యని వెఱఁగొందుచున్నవాఁడ.

విశ్వా:—అతని మహత్త్వము మిమ్మేమి యుపకరింపఁగలదు ? నాచెంతనున్నంతదనుక నీకెట్టి యాపదలును సంభవింపఁ జాలవు.

త్రిశం:—(పురోభాగముఁ జూచి, సభయకంపముగా) ఓయీ మిత్రవర్యా! చూడుము. వికటభ్రూభంగ భీషణ రోషకషాయితాక్షుఁడై అవచ్చువాఁడు ఇక్ష్వాకుకుల పురోహితుఁడగు వసిష్ఠుఁడే కానోపును! (అని భయము నగుపర్చుచున్నాఁడు.)

విశ్వా:—కానిమ్ము. అయినను మనలనేమి నేయంగలఁడు? సుక్షత్రియవంశ్యులమగు మనమీ బ్రాహ్మణునికి వెఱవనేల? మాకతఁడు పురోహితుఁడు కాఁడు.

త్రిశం:—(కంపముతో) మిత్త్రవర్యా! చూడుమటు:--

చ. జటలు తటిద్ద్రుచు ల్వెలుఁగ ♦ జానువిలంబితబాహుదండసం
ఘటిత కమండలుండు నతి♦కర్కశభీషణభాషణుండు ను
త్కటజపమాల హస్తమునఁ ♦ దాల్చుచుఁ గోపకషాయితా
త్ముఁడై, చటులగతి న్వసిష్ఠుఁ డిట ♦ సత్వరతన్ జనుదెంచె
నక్కటా!

వసి:—(శిష్యపరివృతుఁడై ససంభ్రమముగఁ బ్రవేశించి.)

ఉ. ఓరి దురాత్మ! నావనము ♦ నుండిన గోవు వధించితిట్లు ని
ష్కారణమున్ లభించెఁగద ♦ కల్మష మెట్లును బోదు,మూ
ర్ఖ! యీ, ఘోరపు కృత్యమున్ సలిపి ♦ గొప్పఁ దలంచెద,
వోర నా తపో, ధారల నీదు కల్మి నిఁక ♦ దగ్ధముఁ జేసెదఁ
జూడు మిత్తరిన్.

త్రిశం:—(భయమున వడఁకుచుఁ దనలో)

చ. గురువిటు వచ్చి నన్నుఁగనెఁ ♦ గోపముచేత శపించునొక్కో!
యీ, దురితముఁ బాపుకోఁ దెరువుఁ ♦ దోఁచదు, మిత్త్రుని
తోడ నీ దురా, చరణముఁ జేసితిన్ మునికి ♦ సంతసమెట్లిఁ
క నేను జేయుదున్?, ద్వరితముగాఁ బురంబునకుఁ ♦ దా
ర్కొనకిచ్చట డాఁగియుండెదన్.

(అని లతాగహన తరుజాలాంతరితుఁ డగుచున్నాఁడు.)

విశ్వా:—త్రిశంకువు వీడి పోయినాఁడు. కానిమ్ము. నేను క్షత్త్రియుండ
నయ్యు నీ బాపనికి వెఱవనేల?

వసి:—ఓరీ! క్షత్త్రియాధమా! నాతపోవనమునందున్న గోరత్నమును నిష్కా-

రణము వధించితివి. కట్టా! నీచేసిన దుష్కృతి కిదె ఫలమనుభవింపఁ గలాఁడవు. చూడుము నాశక్తిని (అని విక్రమించు చున్నాఁడు.)

విశ్వా:—(తనలో) క్షత్రియునకు బ్రాహ్మణునితోడిదగు పోరాటము లజ్జాస్పదము. అయిన నుపేక్షించిన నీతండు మఱియు విక్రమింపఁగలఁడు కావున నా పరిజనులగు వేత్రహస్తుల రావించి వెరపించినచో నీ బ్రాహ్మణుఁడు లొంగి స్వాధీనుఁడు అగునని తలంతును. (ప్రకాశముగా) యెవరక్కడ సేనాపురుషులు? (అని సేనలను పిలుచునట్లు ఆర్భాటము సేయుచున్నాఁడు.)

వసి:—ఓరీ! క్షత్రియపాంసులా! నీసేనలను నిన్నునొక తృణమునకు లెక్కగొనను. నాదగు బ్రహ్మబలముచే నీక్షాత్రమును రూపుమాపెదను.

విశ్వా:—(పరిహాసముగా) అట్లే కనిపించుచున్నది. కాని సుక్షత్రియుఁడనగు నాకీ పేదపారుని తోడిదగు పోరు లజ్జాస్పదమని తలంచి యుపేక్షించుచున్నాఁడ.

వసి:—(సక్రోధముగ) హుం--ఉపేక్షించుచున్నాఁడవా? నీయింట నిరంతరము స్వస్తివాచనముఁ జేయు సామాన్యబ్రాహ్మణమాత్రునిఁగ నన్నుఁ దలంచితివి కాఁబోలును? అట్టి సామాన్య బ్రాహ్మణుఁడను నేనెంతమాత్రము కాను.

చ. నలువ సృజించు వర్ణముల • నాల్గిట బ్రాహ్మమొ, లేక క్షాత్రమో, బలమను సంశయంబు నిటుఁ • బాపెదఁ జూడుము నాదుశక్తి పు, ష్కలముగ, బ్రహ్మదండమున • సారమపారముగాఁగఁ దెల్పెదర్, నిలువుము పారిపోకు మిటు నేరిమి సాలక సిగ్గుఁ జెందవే!

విశ్వా:—ఉపేక్షించుకోఁదగిది యుద్ధాపేక్ష పెరుగుచున్నట్టులున్న దే. రమ్ము దండధరపరివృతుఁడనై నీగర్వమడంచి పుచ్చెద. అవ్వలికేగి యుద్ధము సేతము రమ్ము (అని వెళ్లుచున్నాఁడు.)

వసి:—అటులనే కానిమ్ము. నీదుక్షాత్త్రమున కింతయు వెఱచువాఁడ నెన్నటి కిని గాను. (అని వెంటనే నడచుచున్నాఁడు.)

[తర్వాత అందఱును వారితో నిష్క్రమించెదరు.]

[గద్య. ఇది శ్రీమత్త్రిభువనపవిత్ర గౌతమసగోత్రవతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భ పారావారకళా
నిధి శ్రీ కాశీనాథవిద్వత్కవిప్రణీత
పూర్వశాకుంతలనాటకమునఁ
ప్రథమాంకము.]

---

# ద్వితీయాంకము.

—෴(·)෴—

## విష్కంభము.

విదూ:—(ప్రవేశించి) హాహా! హా! (అని నవ్వుచు) ఓయీ మహాబ్రాహ్మణా! ఎంతచిత్రముగ నున్నది. ఆబాల్యస్నేహితుఁడనని విశ్వామిత్రమహారాజువెంట వేఁటకుఁజని పరిశ్రాంతులమై వెతఁజెంది యొకచోట నున్నసమయమున, విశ్వామిత్రుఁ డాహారముఁ దెచ్చెదనని యన్వేషింపఁబోయి, సవత్సయగు గోవునొక జిఘాంసుఁడు వెన్నంటుటఁగని తద్రక్షణార్థము బాణమువేయ నది హింసకునితోఁ గూడ నాపదఁ బొందుటయు, నీసంగతిఁ దెలిసి క్రుద్ధుఁడై వసిష్ఠమహర్షి రాగా, విశ్వామిత్రుఁడు దండప్రయోగము సేయఁ దివురుటయును, అట్టియెడ విశ్వామిత్రునకు సహాయము నొనర్ప నన్ను త్రిశంకుమహారాజు పొమ్మని నియోగించుటయును గలుగుటచేత నేనిచ్చటికి వచ్చితిని. హా హ్హా హ్హా! బ్రాహ్మణుండనై జన్మించినందుల కింతకాలమునకు నాదండము సప్రయోజనంబైనయది. [కొంచెము పరిక్రమించి దండమును ద్రిప్పుచు-నంతలో నాయాసము నభినయించి మెల్లగ నడచుచు ఆకాశమున వినుట నభినయించుచు] ఆహాహా! వీరుగో వసిష్ఠవిశ్వామిత్రులు. పరుషవాక్యములఁ బరస్పరము నిందించుకొనుచు వీరులై యుద్ధమునకు సన్నద్ధులై యున్నారు. నేనును విశ్వామిత్రమహారాజునకు సహాయుఁడనై నిలచియుండెదను. (అని ససంభ్రముగఁ జనును.)

[విశ్వామిత్ర వసిష్ఠుల ప్రవేశము.]

వసి:—(దండము ద్రిప్పుచు సాధిక్షేపముగా) ఓరీ! క్షత్రియకులాపశద

మదోన్మత్తా! (అని "నలువసృజించు వర్ణములు" అను పద్యమును మఱల సాటోపముగాఁ జదువుచున్నాఁడు.)

విశ్వా:—ఓయీ! మునిబ్రువా! వసిష్ఠా!

చ. జలముల మున్గి వల్కలముఁ • జక్కఁగఁ గట్టి విభూతి పూసి ని, శ్చలముగ నొక్కచోట జప • సంగతి నుండక యస్త్ర శస్త్ర సం, కలితుల మైన మమ్ముల న•కారణ మిచ్చట నిట్టులీగతిన్, జులకని మాట లాడెదవు • చూచెదు మా భుజ శక్తి నిచ్చటన్.

(అని హుంకరించి శరసంధానముఁ జేయుచున్నాఁడు.)

వసి:—(దండమును మంత్రించి త్రిప్పుచు) ఓరీ! క్షత్రియాధమ! బూడిదఁ బూసికొని తిరుగు బ్రాహ్మణ సామాన్యుఁగా నన్నుఁ దలచితివి గాబోలును. చూడు మటులైన నా శక్తిసామర్థ్యములను.

విశ్వా:—బ్రాహ్మణునితోడి పోరాటము లజ్జాకరంబని యుపేక్షించిన మాత్రానఁ బైకి లంఘించుచున్నాఁడవు. కావున నిదె నిన్నీ శరము వేసి పీడితుఁ గావించెదను. (అని సాటోపముగఁ దివురుచున్నాఁడు.)

వసి:—ఓరీ! క్షత్రియాధమ! నీ బాణవేగమునంతయుం నీ బ్రహ్మదండమొక్కటియే యణఁపఁ జాలును. నీవిఁక నేమి చేసెదవో చూచెదఁ గాక.

(అని ఎదురై నిలుచును)

విదూ:—చూడుమిదె నా దండము. ఇయ్యదియే, నీశక్తిని తృణీకరించి జయింపఁ జాలియున్నది.

శిష్యు:—నీదండ మబలులపైని మాత్రమే గాని, మాబోఁటి బలవంతులపై నుపయోగపడదు. కాన నింతటఁ బురమునకుఁ బొమ్ము.

విశ్వా:—(నిట్టూర్పులు పుచ్చుచు) ఆహా! బ్రహ్మదండపుఁ బ్రభావమో, లేక నాదైన దురవస్థయో. కాని ధనువు నాకర్షించుటకేని సామ

ర్థ్యము చాలకున్నది. ఇఁక నస్త్రములకుండెడి సహజతైక్ష్ణ్యము లేనే లేదు. (తల పంకించి) అగును. బ్రహ్మబలమే బలము.

శిష్యు:—ఓయీ క్షత్రియపాంసుల! మాదర్భాసనపు చుట్టలకైనను నీ కోదండంబు సరిరాజాలదు.

విశ్వా:—(నిర్విణ్ణతతో) నేను దీర్ఘతపంబొనరించి బ్రాహ్మణ్యము నార్జించి యీవసిష్ఠమహర్షి చేతనే బ్రహ్మర్షి యనిపించుకొందును. అట్లైనచో నేను కృతార్థుఁడ నయ్యెదను. కావున తపోనిష్ఠ కనుకూలించు సిద్ధాశ్రమమునకుఁ బోయెద (అని వెళ్లుచున్నాఁడు.)

విదూ:—నేను మనోహరమగు వనమునఁ దపమాచరించి, పకాలమున నాఁకలియైనచోఁ శాకమును స్వయముగఁ జేసికొనుటకై మంచి సుందరాంగి నయ్యెద. మున్ముందు వంటయింటికేగి యుంపవాసదినములగూడ భోజనము సేసి -ఆపై నీవృత్తాంతమును త్రిశంకుమహారాజున కెఱిఁగించెద. అటుమీఁద వనమునకుఁ జనెదను. (అని నిష్క్రమించు.)

వసి:—ఎట్టకేలకు క్షత్రియాధముఁడు నిర్జితుఁడై పోయెఁ గాబోలు. కానిమ్ము. (సాలోచితముగ) ఇఁక నేనును పురమునకుఁ బోయి నాశిష్యుఁడగు నా త్రిశంకువును శపించెదను. (అని సశిష్యుఁడై వెడలిపోవును.)

(ఇయ్యది విష్కంభము.)

(మంత్రులతోఁ సహా ఆస్థానగతుఁడగు త్రిశంకుని ప్రవేశము.)

త్రిశంకు:—(నిట్టూర్పులు పుచ్చుచుఁ దనలో)

ఉ. భానుప్రసిద్ధవంశ మతిభాసుర; మందు జనించి రాజ్యసం
స్థానము నేలితిన్ నయపథంబుఁ దొలంగక వేదశాస్త్ర వి
జ్ఞానుఁడ, వేదచోద్యమగు కర్మను జేయుచుఁ బుణ్యశాలినై
నేనిఁక నీశరీరమున నిత్యపదంబును జేరుటెన్నఁడో!

అమా:—దేవరవారు మిగుల వెతఁ జెందినటులఁ గాన్పించెద రేమికార ణమో తెలియరాదు. వేఁటబడలికయే యిట్లుచేసెఁ గాఁబోలును.

త్రిశంకు:—(ప్రక్కకు తిరిగి) ఓయీ నయవిశారద; అమాత్యవరా!

క. ఉత్తమపథంబు ధర్మా
యత్తము, ధర్మంబు స్మృతుల • కధికసహాయం
బెత్తెఱువున ధర్మక్రియఁ
జిత్తమునం జేర్పవలయు • జీవించు తరిన్.

నయ:—మహారాజా! కోశ మిత్ర రాష్ట్రముల వృద్ధిఁబొందించుచు, శాంతుఁ డవై సాధువులగు ధరణీసురాదుల నరసి, కుటుంబరక్షణము సేయుము. మరణంబులం గలంగక విరోధులం బరిమార్పుము.

త్రిశంకు:—నయవిశారదా! నీచెప్పిన ధర్మములు క్షత్రియులకు సామాన్య ములు. అందునను సద్గతికారణములు.

క. ధ్యానమొ యింద్రియవృత్తుల
మానుటయొ యహింసొ గురుస•మర్చనమో ని
త్యానుష్ఠానమొ వ్రపమో
హీనం బగు సేవ్యమెద్ది • వినఁగాఁ దలఁతున్.

నయ:—మహారాజా! సకలబుధజనగోష్ఠీనిష్ణాతు లగు దేవరవారికం టెను విన్నదింతయుం లేదు. అయినను నాదగు నేర్పుకొలఁది చెప్పెదను.

క. ఈ యారు నున్నమంచివె
యై యుండు నహింసయున్న • నైదిఁటికిఁ బవి
త్రాయతనమగుచు నొప్పుచు
నా యుత్తమధర్మములను • నది వెలయించున్.

కావుననే 'అహింసా పరమో ధర్మః' అని యహింసయే పరమ ధర్మముగాఁ బరిగణింపఁ బడెను. కావున నదియ యనుష్ఠేయమును సేవ్యము నగును.

త్రిశంకు:—(స్మృతి నభినయించి - నిట్టూర్పు పుచ్చుచు) అమాత్యవరా! ప్రత్యవాయ మొకటి గల్గినది. ఆబాల్యము నాటఁ బాటలఁ బరమమిత్రుండను తలంపున, విశ్వామిత్ర రాజర్షి ఘోటకనివహంబుతో వేటకుఁబోవ నేనును పోయితిని. అచట మహాటవిం బరిభ్రమించుచు నొకచోటఁ బరిశ్రాంతులమై క్షుధాక్రాంతుల మైతిమి. అపుడు విశ్వామిత్రుఁడు వన్యాహారముఁ దెచ్చెదనని పోయె. ఆట నొక జిఘాంసుఁడు గోవువెనుదగిలి చంప వచ్చుచుండఁగా దానిని సంరక్షించుట కర్జంబను బుద్ధి నాతండు బాణమును వింట ననుసంధించి వేయఁగా, హింసకునితోఁ గూడ నాధేనువు నాపదం జెందినది. విశ్వామిత్రుం డును నామాంసంబుఁ గొని తెచ్చి శరీరధారణమే ముఖ్యధర్మమని బోధించి యిచ్చిన నేఁ దిననొల్లనైతిని. ఆతండాఁకలిచే బాధితుఁడగుచు నకనక నేలంబడి ప్రాణంబుల నిలుపుకొన నశక్తుండై యుండఁగా, "మిత్రుండెచ్చట మృతికిఁ బాల్పడునో" యన్నదయచే నే నొడంబడి భుజింప, నాతండును భుజియించె.

నయ:—రాజోత్తమా!

గీ. ప్రాణములు నిల్ప, నాపదఁ ♦ బరిహరింప
నొండుపాయమెయ్యెదియు లే ♦ కుండెనేనిఁ,
గుక్కమాంసము నైనను ♦ గుడిచి తనదు
తనువు నిల్పుట ముఖ్యః మిా ♦ దారి కలదు.

త్రిశంకు:—ఓయీ యమాత్యవరా! ఈపాప మపనయించు నుపాయంబు నిరపాయంబగు నదేదియైనఁ దోఁచినచోఁ జెప్పఁగలవా?

నయ:—రాజశ్రేష్ఠా! నాబుద్ధికిటులు పరిహారము పొడఁగట్టుచున్నది. ఏమని యందురా? వినుఁడు.

క. పరహితము సేయఁబూనిన
పురుషుఁడు పాపంబుసేయఁ ♦ బొందఁడు కీడున్

బరమముని యగు నగస్త్యుఁడుఁ
బరోపకారార్థకృతిని • భవ్యుఁడయ్యెన్.

అయినను—'రాజా రాష్ట్రకృతం పాపం, రాజపాపం పురోహితః' యన్నాఁడు. గావున నీపాపమును అపనయించుట పురోహితునికిఁ గృత్యమగుటచే నాతండు శాంతికాది విధుల దీనినంతయును పోఁగొట్టఁగలండు.

గీ. అమర గరుడ గంధర్వ వి•ద్యాధరాది
దివ్యులకు నధ్వరంబులఁ • దృప్తిఁజేసి
పరమశుభముల నొందఁగఁ • బ్రభునిఁ గూర్చి
హితము నొనఁగూర్పఁ దగుఁ బురో•హితుని బుద్ధి.

త్రిశంకు:—(సాశంకముగా) అగును. నిజమే. కాని, అట్టి పురోహితుఁడగు వసిష్ఠుఁడు గూడ నాయందు సంగదోషము నాపాదించి కుపితుఁ డయ్యె. ఇంతకు నతఁడు కోపించి నన్నేమిచేయునో యని వ్యాకుల పడుచున్నాఁడను.

(ఇంతలో నేపథ్యమున వసిష్ఠుఁడు ఆక్రోశముతో)

"ఓరీ విశ్వామిత్రాదులారా! మీ రాజెచ్చటనున్నాఁడో వేగఁ జెప్పుఁడు. చండాలుండేని చేయంజాలని ఘోరకృత్యమును చేసివచ్చి, మహాప్రభువుంబోలె నెల్లవారలఁ బోషింతునని ప్రజలమోసపుచ్చుచున్న ఆ దురాత్ముం డెచ్చటనున్నాఁడో చెప్పుఁడు. వేగముగఁ జెప్పుఁడు."

త్రిశం:—ఎవ్వరో వచ్చుచున్నటులున్నది. (సాలోచనముగా) చూడుము. (కంపముతో) వసిష్ఠమహర్షియే కాఁడు గదా?

దౌవా:—(ప్రవేశించి) మహారాజా! తమ కులగురువగు వసిష్ఠుఁ డతి ధృష్టతతో ద్వారముననిలచి రోషకషాయితాత్ముఁడై హుంకరించి యున్నాఁడు.

త్రిశంకు:—(భయసంభ్రమములు గదుర) అమాత్యవర్యా! వారిని శ్రౌతవిధిచే సత్కరించి సత్వరముగాఁ బ్రవేశింపఁ జేయుము.

నయ:—దేవరయానతిఁ జేసెదను. (వెడలిపోయి మఱల వసిష్ఠుని దోడ్కొని, ప్రవేశించి) మహర్షివర్యా! ఇటు విచ్చేయుఁడిటు విచ్చేయుఁడు.

వసి:—(ప్రవేశించుచుఁ గోపముతో) చెప్పుము. మీరాజెచ్చటనున్నాఁడో చెప్పుము. నాకుఁ దాను శిష్యుండననిదైన వెఱపులేక, చండాలునిఁ బోలె ఘోరకృత్యములఁ జేసి మదాంధుఁడై మోసపుచ్చుచున్నాఁడు. [అని సకోపముగ - సాక్షేపముగ - పరిక్రమింపసాగును.]

త్రిశంకు:—[తనలో] ఆహా!-- ఇదిగో వసిష్ఠమహర్షి వచ్చుచున్నాఁడు. నాయెడఁ గూడ సంగదోషము నాపాదించునేమో కదా! (ముందు నకుఁ జూచి ప్రకాశముగా.]

చ. దండము బ్రహ్మవర్చసప♦దంబు కమండలు వొక్కచే మహో
ద్దండతమండుచుక్ నివురుఁ♦దాల్చినయగ్నికణంబువోలె పా
షండకులప్రచండుఁడన ♦ సజ్జితుఁడౌచు వసిష్ఠుఁడొప్పె వే
దండము హస్తదండము ను♦దగ్రముగాఁ బడద్రిప్పకై వడిన్.

(స్వ) కానిమ్ము. బుద్ధిపూర్వకమగు నపరాధముకాదని సాష్టాంగముగ దండప్రణామముఁ జేసి వేడికొనియెద. (అని ఆసనమునుండి దిగ్గన లేచి) ఓ మహర్షివర్యా! వసిష్ఠా! ఇక్ష్వాకువంశోత్పన్నుఁడగు నీ త్రిశంకువు కులగురువుల పాదములకు దండప్రణామము లాచరించుచున్నాఁడు.

(అని పాదముల వ్రాలును.)

వసి:—(సాధిక్షేపముగా) ఓయీ మతిమదగ్రేసరా! నాపాదముల నంటకుము. నాకు శిష్యుఁడవనుట యవమానమున కాస్పదమే కదా!

క. గోహత్య ఘోర మందును
సాహసకృత్యంబు పైన ♦ సాధుత్వ మయో

మోహాంధకారదృష్టికి
బాహాటంబైన సరణి • పట్టువడునొకో!

చండాలుని కృత్యమునకంటెను ఘోరమయిన కృత్యము నాచరించితివిగదా! ఇట్టి నీవు పవిత్రమగు ప్రజాపాలనంబుల కెట్టులోపఁగలవు. కావున నేటినుండి కర్మబాహ్యుండవయ్యెదుగాక. (అని శపించుచున్నాఁడు.)

త్రిశం:—(భయగద్గదికలతో) గురువర్యా! మహాత్మా!

చ. ఎఱిఁగి యెఱుంగకేని తమ • కిష్టము గానిది చేయనోడు నా
దురితము బాపి నన్ను దయ • తోడఁ గనుంగొను సూర్య
వంశ్యులౌ, నరపతులెల్ల నీదు కృప • నమ్మిగదా ధరనేలజాలి
రే, శరణమటన్న వాఁడనను • సంయమివర్య క్షమించి బ్రోవవే.

(అని యశ్రుధారలఁ గాళ్లపైఁ బడుచున్నాఁడు.)

వసి:—ఓయీ మూర్ఖా!

క. నామాట తప్పబెట్టును
నీమం బిసుమంతయైన • నెరవేర్పక నీ
వీమాదిరి జేయుదొకో
గోమాంసముఁ దినుటకన్న • ఘోరము గలదే?

తెలిసితిమిను విశ్వామిత్రు నండఁజూచికొని యిట్టి ఘోరకృత్యముఁ జేసిన నీవెట్టులు రక్ష్యుండవగుదో యాలోచింపుము.

త్రిశం:—మహాత్ములారా! అపరాధినిఁగాఁ దమకు దోఁచినను నిరపరాధి నగు నన్ను రక్షింపక తప్పదు. (అని వసిష్ఠశిష్యుల పాదముల వ్రాలుచున్నాఁడు)

వసి:—శిష్యులు:—(లేవనెత్తుచు) బైదా గురువచన మేరికిని అనుల్లంఘ్యము. కాన పరాధీనవృత్తులమగు మనము కర్మఫల మనుభవించుటకంటెను

జేయఁగలదేమియును లేదు. శాపమును నివర్తింపఁజేయుట మాకశక్యము.

వసి:—చేసినదానికి ఫలమనుభవింపుము. పొమ్ము. [అనుచు వసిష్ఠుఁడును నతని శిష్యులును నిష్క్రమింతురు.]

త్రిశం:—అయ్యో! పరమపాంసుఁడను నశరణుండనైతి. ఏమిసేయుదు; నెచ్చటికిఁబోయెదను. అయ్యా! నయవిశారదా! చూచితిరిగదా. గురువులు శపించనే శపించిరి. ఇటుపై నేమిసేయఁదగును?

క. కోపిష్ఠియగు వసిష్ఠుని
శాపంబున సంగదోష♦సంభవమగు నీ
పాపం బేక్రియఁ దొలగు ను
పాయమునిఁక నేది నన్నుఁ ♦ బావనుఁ జేయన్?

నయవిశా:—(సుదీర్ఘముగా నాలోచింపుచు) అగును. ఈవసిష్ఠునిపైఁ గల యభినివేశమున దుర్లభంబగు బ్రాహ్మణ్యంబు సంపాదింపం దివిరి దీర్ఘతపంబొనర్చెడి విశ్వామిత్రుఁడు తమకు మిత్రుండెకదా! అతండుండ తమరింత వందురనేల? అతండె దీనినంతయును బోఁద్రోలి సుగతి నీయఁగలండు. ఎట్లందురా? చెప్పలేదా పెద్దలు:—

క. తనరఁగ మిత్రుఁడు రజతముఁ
గనకము బుద్ధి యను నాల్గుఁ♦గారణములు మ
ర్త్యుని దుష్కృతముల నాఁపఁగ
నన్నింటను మిత్రుఁడెక్కుఁ♦డఱసిన యెడలన్.

త్రిశం:—అట్లైన నొనర్పుము. అమ్మహాత్ముని పాదములం బట్టియైన నాకు సుగతిం గూర్పఁ దలపడుము.

నయవిశా:—మహారాజా!

క. యానాసనాన్నపాన వి
ధానాదులఁ బలితుఁ జేరి • తాఁ బలితుండై
మానవుఁడు దపోముఖ ధ
ర్మానుష్ఠానములఁ బాయు•నా కిల్బిషమున్.

త్రిశం:—(వినకయే యనుస్మరనుచు)

ఎంతకష్టమెంతకష్టము—అసలే మానవజన్మము......అందుననుఁ ప్రజాపాలనతత్పరమగు క్షాత్త్రజన్మము అతిదుర్భరము. ఏమందువా? ప్రజారక్షణవిధానము సరిగానిచో లోకులును శీలము సరిగానిచో గురుజనమును దయాదాక్షిణ్యములు తగినట్లు లేనిచో సర్వభూతములును, నవమానించుటయేగాక బ్రువ్వఁ దిట్టుదురు. అట్టిస్థితిలో జరావిక్లబములై యస్వాధీనములైన యంగములు క్షత్త్రియునికి స్వదేహయాత్రామాత్రమేని జరుగుట దుర్లభము. అందునను ప్రజల యోగక్షేమముల నారసి ప్రజాపాలనము జేయుట యన్న నిఁక నెక్కడిది? ప్రకృతము నాస్థితి యిట్టిదే!—

ఉ. తత్తరపాటు చిత్తమున•దార్ఢ్యము నంగములందు పైని నా
సత్తియు జాలకుండు కొన•సాగని కోరికలెల్లపెల్లు సం
పత్తియు యాతయామముగ • భాసిలు నాశలు హెచ్చు
కోపముల్, మత్తునిమాడ్కి దుష్టజన•మానవు నెంతటివానిఁ
జేయదే.

గావున నిఁక నేను నాకుమారుఁడగు పృథువుపైని రాజ్యభారము నునిచి పోయెదను. నీవతనికి బాసటయైయుండి, భారమునంతను నతనియొక్కనిపైననే దిగవిడువక, ముఖ్యాంశముల నతనికిఁ దెల్పుచు యుంక్తరీతిని వర్తింపుము. (కొంచెము నిదానించి) యజమానిత్వము నా నార్జితమును రక్షించి ముందటివానికి నొప్పఁజెప్పునట్టి దాసత్వమే

కదా! (అని రాజముద్రికాదులను మంత్రికి నిచ్చును.) ఇఁక నేను అంతఃపురికల కిద్దాని నెఱింగించి యడవులకేగి యత్రనిపాదములనే బట్టికొని సుగతినొంద జేయవేఁడెదను. (అని లేచి సాశంకముగ నొండు రెండు అడుగులునడచి తనలో) విశ్వామిత్రునివృత్తాంతముఁ దెలియనంపిన విదూషకుఁ డింక రాఁడేలొకో! (అని ఆలోచించు చుండును.)

నయ:—మహారాజా! మాధవ్యుఁడు వచ్చుచున్నటులున్నది. అదిగో కలకలము విననయ్యెడిని.

విదూ:—(సంభ్రమముతో ప్రవేశించి ముందునకుఁ జూచి తనలో) ఆహా! రాజుగారు గూడ శాపభిన్నులై చింతించుచున్నారు. ఇట్టిస్థితిలో నిచ్చటనుంటినా భోజనవేళ యతిక్రమింపక తప్పదు. ఇఁక నిద్దుర మాటను చెప్ప నేల?

త్రిశం:—ఓయీ మాధవ్యా! ఎచ్చటికేగి వచ్చుచున్నాఁడవు?

విదూ:—మహారాజా:- దేవరయానతిని విశ్వామిత్రునికి సహాయుఁడనైతి. కాని ఆసంగరమున వసిష్ఠునిదండము ముందట విశ్వామిత్రునిబలము దుర్బలమగుటయును, వసిష్ఠుని దండము నాదండమునుగూడ తృణీకరించి విజృంభించుటయును, విశ్వామిత్రుండు లజ్జితుఁడై 'బ్రహ్మబలమే బలము కాని క్షత్త్రియబల మనుపయోగము'—అని నిశ్చయించి తానును బ్రాహ్మణ్యమునార్జించు తలంపున సిద్ధాశ్రమమునకుఁ జనుటయుఁ నైనది.

త్రిశం:—మంచిమాటసెప్పితివి. ఆతఁడు నాకు మిక్కిలియుఁ గూర్చు మిత్రుఁ డగుటం జేసి నాకు తనతపమునైన ధారపోసి స్వర్గతి నిప్పింపంగ లఁడు. కావున నేను నడవులకుఁ బోయి యాతని యనుగ్రహమునే పొందెదను. మాధవ్యా! వానప్రస్థుఁడ నయ్యెద. నీవును రావలయు.

విదూ:—మహారాజా! నేను రాజాలను. వేళపట్టున భోజనమును నిద్రయును నాకు లభింపవు. పైగా నేను సద్బ్రాహ్మణుఁడను. కాఁబట్టి నన్నీవిషయమున నిట్టులు నిర్బంధము సేయుట న్యాయ్యము కాదు.

త్రిశం:—(తనలో) ఈమూర్ఖాగ్రేసరుఁ డెంతటి కార్యప్రస్తావనల యందు సైతము తన భోజనవ్యవహారమునే చెప్పును కదా! కానిమ్ము. వీని యిచ్ఛానుసారము భాషించెద. 'మూర్ఖం ఛందానురోధేన'—అని గదా పెద్దలందురు. కాఁబట్టి ఈ మూర్ఖుని నతని యిచ్ఛానుసరణము చేతనే స్వాధీనుఁ జేయవలయును. (ప్రకాశముగా) ఓయీ మహాబ్రాహ్మణా! అచ్చోట విశ్వామిత్రుని సాయమువలన గొప్ప యజ్ఞము జేయనున్నాడ. నీవు నప్పుడు భక్ష్యభోజ్యాదుల యథేష్టముగ దృప్తుఁడవు కాగలుదువు.

విదూ:—(సహర్షముగా) అటులైనచో వచ్చెదను.

త్రిశం:—మంచిది. అంతిపురమునకేగి ప్రియాజనముఁ దోడ్కొని వచ్చెదను. నీవు ముందు నడువుము.

విదూ:—మహారాజా! ఇటు విచ్చేయుండు. ఇటు విచ్చేయుండు.

త్రిశం:—(ఖిన్నమనస్కుతతో రెండడుగులు నడిచి సంధ్యాకాలమగుట నభినయించి) ఆహా! తనదు వంశమునఁ బుట్టి యిట్టి దురవస్థఁ జెంది యున్న నన్ను జూచి, సూర్యభగవానుఁడు మిగుల వెతఁజెంది యపరాబ్ధిని గ్రుంకుచున్నాఁడు. సహజముగనే లోకబాంధవుఁడు. పైగా తనకు విశిష్టబంధువులమగు మావిషయమున నిఁక నేమి చెప్పవలయును?

చ. ఇనుఁడపరాబ్ధిఁ గ్రుంకె ఖగ♦హేలలణంగె, చెలంగె మీరి
తూ,ర్పున శశి యారా! పంకజము ♦ పొంకమడంగె వియో

గిమానినీ, మనము గలంగె మన్మథుఁడు మార్గణముల్
గురియందొడంగె జ్వరనికరమెల్ల పొంగెను తరంగ పరం
పరచేఁ బయోధియున్.

విదూ:—మహారాజా! ఇటు విచ్చేయుఁడు ఇటు విచ్చేయుఁడు.

[రాజును విదూషకుఁడును నిష్క్రమింతురు.]

గద్య. ఇది శ్రీమత్త్రిభువనపవిత్ర గౌతమసగోత్రపవతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భపారావారకళానిధి
శ్రీకాశీనాథ విద్వత్కవిప్రణీత
పూర్వశాకుంతలనాటకమున
ద్వితీయాంకము.

# తృ తీ యాం క ము.



(నారదుఁడు మహతి (వీణె)తోఁ బ్రవేశించి భాషాంతరము నాశ్రయించి స్వగతముగా.)

నార:—భగవన్ ! శౌరే మురారే !

శ్లో. గోవింద మిందువిలసద్వదనారవిందం
బృందావనైక శుభమందిర మిందిరాయాః,
ఆనందకంద మతిసుందర మేవ నౌమి
త్రాతార మార్తిశరణం యదునందనం త్వామ్.

నేను వైకుంఠమున నిందిరాసుందరుఁ డగు గోవిందుని భజించి భూలోక వృత్తాంతములఁ దెలియుటకై యిటు వచ్చితి. (ముందునకు చూచి) ఆహాహా ! సకలచరాచర ప్రపంచమును సృజించునట్టి కమలాసనుఁడు, అతిత్వరితగతి నెచ్చటికో పరిక్రమించుచున్నట్లు తోఁచుచున్నది. కానిమ్ము. సమీపించి విశేషములనడిగెదను. (అని యించుక పరిక్రమించి (సవినయముగా) మహాత్మా ! వందనము నొనర్చుచున్నాఁడ.

బ్రహ్మ:—(ప్రవేశించి) ఓహోహో ! నారదమహర్షి కాబోలును. స్వస్తి యగుగాత.

నార:—క. ఎందుండి యేమిపనికై
యెందులకేగెదవు శారదేశ్వర మఱియున్
బొందితి నినుఁగని సౌఖ్యము
విందవయితి నాకు నీదువిధమున్ జెపుమా.

బ్రహ్మ:—(సుదీర్ఘముగ నిట్టూర్పుపుచ్చి) నా దుఃఖము నేమని చెప్పుదును? ఇలలో గాధికిఁ బూర్వజన్మకర్మపరిపాకమున క్షత్రియుఁడై పుట్టి విశ్వామిత్రుఁడను రాజు బ్రహ్మర్షియగు వసిష్ఠునితోఁ బోరాడి నిర్జితుఁడై యాతని బ్రహ్మబలమునకుఁ దనక్షాత్త్రము సాటిరాదని మిగుల వెతఁ జెంది బ్రాహ్మణ్యము నార్జించి యతనితోఁ దులదూగెదనను సంకల్పమున నన్నుద్దేశించి దీర్ఘమగు తపము నొనరించుచున్నాఁడు.

నార:—(పకపకనవ్వుచు) మహాత్మా! ఆతని సంకల్పానుసారముగ వరముల నీయదలఁచితిరి కాఁబోలు! అట్లయిన మీదయాబుద్ధికిఁ జాల సంతసము దెల్పుచున్నాఁడను.

బ్రహ్మ:—వత్సా! నారద! నా జగత్సృష్టికరణభారము మిపుల దుర్భరమగుచున్నయది. ఏమని యందువా?—ప్రపంచమునఁ గల సర్వజీవులును జ్ఞానవికలులై స్వదుష్కృత్యపరిపాకమున సంభవించెడి తిర్యగాదిజన్మముల ననుభవమాత్రాన దాటి, క్రమముగా సుకృతవాసనావిశేషముచే శూద్రాదిజన్మములఁ బరిత్యజించి మహాతపోనిష్ఠాగరిష్ఠత బ్రహ్మర్షిపదప్రాప్తికి ముఖ్యమై గణ్యమగు బ్రాహ్మణ్యము నార్జించియుం, మఱి కొందఱు ధనవాంఛాది విషయలోలతఁ బరభాషావేషముల ధరించి, సంధ్యాది విహితసత్కృత్యములఁ బరిత్యజించి యధోగతికిఁ బాల్పడుచున్నారు. ఇంకను గొందఱు తదితరములగు కులములందు జనించియుం సత్సంగాదులమూలమున జనితశాస్త్రజ్ఞానులై ఆజన్మమున కనర్హమైన దురాపమైన బ్రాహ్మణ్యము వాసించి, తమకులాచారముల కనర్హములయిన యుత్తమకులములవారి సదాచారముల ననుష్ఠించి మఱలఁ దమంతఁ దాము యధఃపతనము నొందుచున్నారు. ఇట్టులు స్వస్వకర్మపరిపాకమునఁ దత్తద్యోనులందుఁ బుట్టి, సుఖదుఃఖానుభవములఁ దారతమ్యముగలవారై 'చివఱకింతకును విధి యిట్లుచేయుచున్నాఁడ'ని నిష్కారణమ నైర్ఘృణ్యపక్షపాతముల నాకుఁ జుట్టి నన్ను నిందించుచున్నారు.

నార:—నిజము. అయినను తా మింతమాత్రమునకె వెఱవనేల? ఎంతటిజడదారులకైన నిశ్చలబుద్ధి గల్గుట దుర్లభము. కావున నాబుద్ధికిఁ దోఁచిన యొకమాటఁ జెప్పెదను. ఇపుడు మన మమరావతికిఁ బోయి దేవేంద్రునకీతెఱంగు నెఱింగించినచో నాతఁడు మేనకాద్యప్సరసలనంపి తద్ద్వారా వారి దృఢనిశ్చయములను సడలించి మనకు త్రోవఁజూపఁగలండని తోఁచెడిని.

బ్రహ్మ:—వత్సా! మంచియుపాయమును చెప్పితివి. ఇఁక మన ముభయులమమరావతికిఁ బోయి దేవేంద్రుని కీవృత్తాంతము నెఱింగింతము రమ్ము.

నార:—అహా! అట్లే చేయుందము. (అని బయలుదేరఁ బోవును.)

బ్రహ్మ:—(సాశంకముగ) ఓయీ నారదా! కొంచెము సందియముగనున్నది. ఒకవేళ, బ్రాహ్మణ్యాసంపాదనమున దృఢవ్రతుఁడైన విశ్వామిత్రునికిఁ దపోవిఘ్న మాపాదించుటకు ఇంద్రుఁడు మేనకాదులఁ బంపునే యనుకొందము. అయినను అంతమాత్రాన విశ్వామిత్రుఁడు చలించుననుటలో నమ్మకమేమి కలదు?

నార:—(కొంచెము పరిహాసద్యోతకముగా నవ్వి) మహాత్మా! వేదప్రవచనజడతను, శుద్ధఛాందసతను మీరట్లు అంటిరేగాని వేఱొండుగాదు. స్త్రీసాంగత్యమున నెంతటిప్రభావమో గలదు. వినుఁడు.

క. అంతటఁ జెల్లు వివేకం
బంతట నా జపము తపము • నల శూరత్వం
బంతట మానము ధ్యానము
నెంతటఁ దమకనులఁ బడరె • యింతులు నఱయన్.

బ్రహ్మ:—నీమాట నిక్కము. అట్లే చేసెదము రమ్ము. (అని నిష్క్రమించి గతిత్వర నభినయించుచు మఱలఁ బ్రవేశించి) అహో! స్వర్గముఁ జేరితిమి. ఆహా ఏమి స్వర్గము!—

క. సురలును గంధర్వులు న
ప్సరోనికాయములు వివిధ•సరసవిహారా
దరలీల నందులందుఁ
జరియింతు రిదే నితాంత•సమ్మోదమునన్.

నారదా! మనమిఁక త్వరగ నింద్రునిదరిఁ జేరి యతనితో నీవృత్తాంతముఁ జెప్పవలసి యున్నది. కావున నింద్రునాస్థానవాటికిఁ జేరఁ బోవుదము రమ్ము. (అని యుంభయులును నిష్క్రమించుచున్నారు.)

ఇయ్యది విష్కంభము.

(జయంత బృహస్పతులతో నింద్రుని సభామండపము దేవేంద్రుఁడు సింహాసనస్థుఁడై యుండగా ప్రక్కల జయంత బృహస్పతులుందురు.)

బృహ:—దేవాధినాథా! దేవేంద్రా! నీవైభవము నేమని కొనియాడఁగలము! సర్వప్రాణులకు దురాపమగు స్వర్గమున నీకాధిపత్యము గలదు. జరామరణాది సమస్తక్లేశముల నపనయించు నమృతము నీకాహారము. అనితరసాధ్యములైన కామధేను కల్పతరు చింతామణ్యాదులు నీకుఁ గరతలామలకములై సమస్తకోరికల నీనుచున్నవి. నీవిభవ మత్యంతము ప్రశస్తమై యున్నయది. ప్రతిపదమునను రంభాద్యప్సరల నృత్తగీతవాద్యాది వినోదము నీకు ఆహ్లాదము గూర్చునదై నీ దేవేంద్రవిభవమును ముల్లోకములఁ జాటఁ గల్గుచున్నది. ఇట్లయ్యును నీవు చింతాక్రాంతునివలె జూపట్టుచున్నాఁడవు. కారణమేమియై యుండునో కదా!

జయం:—నిజమునకు సంపద యెంతయున్నను సంరక్షకభారము మిపుల శ్రమాకరము కదా!

ఇంద్రు:—(దీర్ఘముగ నిశ్శ్వసించి) మహాత్మా! గురువరా! నాదగు దురవస్థ నేమని చెప్పఁగలను?

ఉ. ఎన్ని భవంబులందు మఱియెన్ని తపంబులొ చేసి చేసి పై
జన్మము లెన్నియే న్నలిపి స్వర్గము నేలితి నింద్రుఁడంచు పే
రెన్నికగాఁగ నుంటి నిఁక నెవ్వఁడొ నాపయి వచ్చునంచు నే
ఖిన్నమనస్కుఁడనై మిపుల ఖేదము నొందెద సౌఖ్యమెట్టిదో!

బృహ:—ఈకారణముననే కొందఱు మహాత్ములు కర్మఫలము లస్థిరములని తలంచి, శాశ్వతమై యఖండానందైకరసమైన మోక్షము నొందుటకై యూహించి, ఈశ్వరార్పితబుద్ధిని గర్మముల నాచరించుచున్నారు. మఱియుఁ గొందఱు ఫలాభిలాషఁ గర్మముల నాచరించి తత్ఫలముల ననుభవించి పుణ్యము తఱుఁగఁగనే మఱల మర్త్యలోకమునఁ బుట్టుచు నున్నవారలు.

దౌవా:—(సత్వరముతోఁ బ్రవేశించి) దేవాధిదేవా! బ్రహ్మయును తదుత్సంగజనితుఁడగు నారదమహర్షియును ద్వారమున వేచియున్నారు. దేవర చిత్తగింపగా వలయును.

ఇంద్రు:—(దిగ్గనలేచి) గురువర్యా! శ్రౌతవిధిచే నమ్మహాత్ముల సత్కరించి ప్రవేశింపఁ జేయుఁడు.

బృహ:—అట్లే యొనర్చెదను. (అని దౌవారికుని వెంట నడిచి సమీపించి) మహానుభావా! చతురాననా! దివ్యర్షి నారదా! ఇటు విచ్చేయుఁడిటువిచ్చేయుఁడు. దేవేంద్రుఁడు మీ యాగమనమును నిరీక్షించి యున్నాఁడు. ఏదేని మహాప్రయోజనము నాకాంక్షించియే తమరుభయులును వచ్చినటుల నెంచెదను.

నార:—నిస్స్పృహులమగు మాకు ప్రయోజనాకాంక్ష యేదియు లేదు. అయినను త్రిభువనాధిపతియగు మహేంద్రుని దర్శింపఁ గుతుకము

వాఁడను జనుదెంచితిమి. (అనుచు బ్రహ్మతో పరిక్రమించి ఇంద్రుని సన్నిధిం జేరును.)

ఇంద్రు:—(వినయసంభ్రమములు గదుర నెదురువచ్చి) చరాచరప్రపంచ కర్తవగు నో పితామహా! నిరంతర హరిధ్యానపరాయణుఁడవగు నో నారదా! ఇదె యీ యింద్రుఁడు సాష్టాంగదండప్రణామముఁ జేయుచున్నాఁడు. (అని వారిపాదములకు మ్రొక్కును.)

బ్రహ్మ:—సర్వదా ఇట్లే ముల్లోకములను నిర్బాధకముగా నేలుచు చిరాయువై వర్ధిల్లెదు గాత.

నార:—యజ్ఞశిష్టాంశముల ననుభవింపుచు నాయా దేశకాలపాత్రానుసారముగ వర్షముల గురియించుచుఁ బరస్పర భారముల వహించి యానందింపుము.

దేవేం:—(సంతోషముగ) కటాక్షితుఁడనైతిని. (అని యుంభయహస్తముల నుభయుల నాదరించి కూర్చుండఁబెట్టి జయంతసహితముగఁ దాను గూర్చుండి) మహాత్ములారా!

ఉ. వేదములన్ వచింప నవి ♦ వేరుగఁ జూచి విభిన్నకర్మసం
భేదముచేత వర్ణములు ♦ భిన్నములై చెడలేదె? సృష్టిలో
నేదగు కార్యముల్ జరుప♦నిట్టులు వచ్చితి రయ్య మీరు స
మ్మోదముతోడ నా పనులు ♦ ముందు ఘటింపఁగ జేయఁ
బూనెదన్.

నార:—దేవాధినాథా! ప్రస్తుతమున ప్రపంచమునందలి వర్ణాశ్రమములు తమ తమ నియతధర్మముల విడనాడి, వర్ణసాంకర్యమొదవింపఁ బాల్పడుచున్నయవి.

బ్రహ్మ:—ఇయ్యది యథార్థము. ఇందులకిదె కారణ - ఇప్పుడిలలో గాధికి పూర్వజన్మకర్మపరిపాకమున క్షత్రియకుమారుఁడై పుట్టి విశ్వా

మిత్రనామమున వెలయుచున్నట్టి రాజు-తనధర్మమును వీడి, వసిష్ఠ మహర్షితోఁ బోరాడి బ్రహ్మబలమున నిర్జితుఁడై బ్రాహ్మణ్యము నార్జించు నుద్దేశమున నన్నుగుఱించి సుదీర్ఘముగ తపము సేయుచున్నవాఁడు. ఆతనితపస్సునకు విఘ్నముఁ గల్గించి యతని నప్ప్రయత్నమునుండి విరమింపఁ జేయు నుపాయమేదియైన గలదేమో యని యోచించుటకై యిట వచ్చితిమి.

ఇంద్రు:—(సాలోచనముగ) ఆఁ. లేకేమి. లోకముల యందప్రతిహతముగ నడంపఁగల నా వజ్రాయుధము లేదా? (మఱికొంచెమాఁగి) కాని దాని నట్టి సాధువులపైఁ బ్రయోగింపఁ జాలకున్నాఁడను. అయిన నేమిచేయఁ గలను?

నార:—అయ్యా దేవేంద్రా! ప్రకృత మీయాపదనపనయింప మీ వజ్రాయుధము పనికిరాదు. పైకి ఎంతమాత్రము నేవిధమైన క్షతమును గాని రక్తపాతమునుగాని చేయకయే యాంతరక్షతి నతినేర్పుమెయి నొనర్చి మర్మచ్ఛేదన మొనర్పం జాలునట్టి సుకుమారమైన శస్త్రమిపుడేదేని కావలసియున్నది.

జయం:—నిజము. అట్టి సాధనమున్నగాని యతని సంకల్పమునకు చలనము గలుగదు. విచారణచేసినచో నట్టి గుణములుగల యమోఘాస్త్రము యువతీకటాక్షములు గాక మఱెయ్యది కలదు?

ఇంద్రు:—అగును. అట్టి యభినివేశము గలవారిని సాధించుట కమోఘమైన యాయుధ మది యొక్కటియే. (భృత్యులవైపు పరికించి) ఎవఁడురా అక్కడ?

దౌవా:—(ప్రవేశించి) చేతులుమోడ్చి దేవరయానతీదగును. సేవకుఁడిదె సిద్ధముగా నున్నాఁడు.

ఇంద్రు:— త్రిభువనయువతీరత్నమగు మేనక నొకమారిటు రప్పింపుము.

దౌవా:—చిత్తము. ఆజ్ఞానువర్తి నగుచున్నాఁడను. (అని నిష్క్రమించును.)

మేనక:—(దౌవారికుని వెంటఁ బ్రవేశించుచు) దౌవారికా! దేవరవారు తమదాసినగు నన్నింత త్వరితముగఁ బిలువనంపెడి యుద్దేశ మేదియై యుండవచ్చునో యెఱుంగుదువా?

దౌవా:—అనుపదమే తెలియఁగలవు రమ్ము. తినబోవు వస్తువు సన్నిహితమగు చుండ నింతలో రుచినడుగుట యెందులకు? ఇంద్రుఁడింతకు నీరాకకై నిరీక్షించియుండఁగలఁడు. కావున వేగముగ సన్నిధికి రమ్ము.

మేనక:—(సవిలాసముగఁ బరిక్రమించి ముందువైపునకుఁ జూచి తనలో) ఓహో! మహేంద్రసన్నిధానమున జయంతుఁడును బ్రహ్మయును నారదుఁడును గూడ నున్నవారలు. ఈదేవేంద్రుఁడు వీరలతోఁగలసి ఏదేని మహాకార్యము నొక్కదానిని నిర్వహింప యత్నించుచున్నట్టు తోఁచుచున్నది. కానిమ్ము ఏమిరానున్నదో! త్వరగ సమీపించెదను.

దౌవా:—ప్రభూ! త్రిభువనయువతీరత్నమును స్వర్గసౌభాగ్యము నగు మేనక తమయానతిని శిరసావహించి ఇదిగో వచ్చియున్నది. దేవర చిత్తగింపఁదగును. (అని నిష్క్రమించును.)

నార:—(ఆపాదమస్తకము వీక్షించి - ఆశ్చర్యముతో)

ఉ. ఔర యొయారఁ, మావళులయందము, తీయని మోవిచందమున్, దీరుగ మల్చివేసిన గతిం దొడలున్నవి, పాలుగారు నో,రౌర! మొగంబు, చక్కదన మన్ని యటుండగ నిమ్ము రొమ్ము వి,స్తారముఁజూడ నెంత జడదారులకైన వి
రాళ మెత్తదే?

బ్రహ్మ:—(శృంగారపరాకాష్ఠను సూచించుచు)

సీ. నీలాల జిగిడాలు నేలఁజాలిన కొప్పుఁ
గప్పు చూపటికన్నుఁ గప్పుకున్నె?

పగడంపు జిగిడంబు♦జగడంబు గల మోవి
చిత్తమందున రక్తిఁ ♦ జేర్చుకున్నె!
కులశైలములఁ గేరు ♦ కుచలీలఁ గనుఁగొన్న
జనుల గుండెలు జల్లు♦జల్లు రనదె!
శరదిందు రుచిఁ బొందు ♦ వెలుఁగొందు చిరునవ్వు
భావింప వెలవెల♦బాఱకున్నె
తే. దళిత కువలయదళ నవ♦లలితనయన
యుగము నగుమొగమిఁక శశిఁ ♦ దెగడు తొడలు
విజితకరికరము లఱయ ♦ విశ్వమోహ
మింత సౌందర్యవతి యింతి ♦ యెందుఁగలదె!

ఇంద్రుః:—(మేనకతో) సుందరీ! నీవలన నొక మహాకార్యము కావలసి యున్నది. ఇక్కార్యమును తప్పక నీవ సాధింప దగుదువు. నీమూల మున మేమును చరాచరసృష్టికర్తయగు నీబ్రహ్మయును నారదుఁడు మొదలగు దేవర్షులును సురలును కృతార్థులము కావలసియున్నయది.

మేనకః:—దేవాధినాథా! తమ యాజ్ఞానువర్తిని యగు నీసేవకురాలికి స్వాధీనమైయుండెడి అంతటి మహాకార్యము ఏదియో ఎఱింగింపవేఁ డెదను. తమ యాజ్ఞను తప్పక నిర్వర్తింపనున్నదానను.

ఇంద్రుః:—ఇట్టి మహాకార్యము నీవు తప్ప యొరులు చేయఁ గాజాలరు కదా! నిజమునకు నీ తీక్ష్ణకటాక్షబాణపాతమునకు స్వాధీనపడనిదెం దైనఁగలదా?

మేనకః:—దేవర! తమసేవకురాలి నిట్లుగ్గడించుట న్యాయ్యమా? ప్రస్తుతము నిర్వర్తింపదగు కార్యవిశేషమును ఆజ్ఞాపించెదరుగాక.

ఇంద్రుః:—ఆజ్ఞ కేమి? చెప్పెదను వినుము. భూలోకమున గాధియను రాజేంద్రునికి పూర్వజన్మపరిపాకమునఁ బుత్రుండై పుట్టిన విశ్వా

మిత్రు, నెఱుంగుదువుకదా! అతఁడు వసిష్ఠమహర్షితో వివదించి పోరాడి నిర్జితుఁడై తుట్టతుదకు ఆతని బ్రహ్మబలముతోఁ దనక్షాత్రము సాటిగాదని యెంచి, అజయ్యమగు బ్రాహ్మణ్యమును సంపాదింపఁ గృతనిశ్చయుఁడై సిద్ధాశ్రమమున నతిఘోరముగాఁ దపము సేయుచు నున్నవాఁడు. దాన లోకమునందలి వర్ణాశ్రమసేతువు మొదలంటఁ గూలుటకు సిద్ధముగా నున్నయది. కావున నీ వచటికేగి ఎట్లైన నతనికి తపోభంగము నొనర్చి కృతకృత్యురాలవై మా యాధిపత్యమును నిలుపవలసి యున్నది. ఇంతకంటెను మించిన పని ప్రకృతము మఱిలేదు.

మేనక:—(భయమున వడఁకుచు) అయ్యా! అంతటి యధిని వేశముతోఁ దపమొనరించునట్టి యారాజర్షి నన్ను శపించి నీరుచేసినను చేయవచ్చును కదా! (అని వెఱపు చూపుచున్నది.)

బ్రహ్మ:—(అభయమును సూచింపుచు) ఎంతమాత్రమును వెఱవకుము. మేనకా! ఒకవేళ నీవన్నట్టులు శాపభీతి యేర్పడినను సంఘటిల్లినచో, మేమందఱమును నీకు బాసటగాయుండి నిన్ను ఉద్ధరింపగలవారము. నిక్కము. మామాట నమ్ముము.

మేనక:—(నిట్టూర్పువుచ్చి) దేవరయనుగ్రహమున నొకింత ధైర్యము గల్గుచున్నది. కాని ఎంతటి అల్పాల్పమగు కార్యమునకైనను సహాయసంపద వలయునంతగాఁ గావలయుననుట మీ యెఱుంగనిది కాదు. అందునను - ఇట్టి మహాకార్యనిర్వహణమున తగినంత సహాయసంపద పుష్కలముగా వలయుననుట నిక్కము. దేవరవార లట్టి సహాయసంపదను చేకూర్చినచో అతిశ్రమమునకైనను కార్యమును సాధించుటకు వీలుకలుగగలదని తోఁచెడిని.

ఇంద్రు:—సుందరీ! నీకీకార్యమున వేఱు సహాయము లవసరములు కావు గదా! సకల జనచిత్తములను తలంచినంతన కలంచి యున్మాదము గల్గింపంజాలు వసంతమన్మథులు నీకు సర్వదా బాసటలై నిలచి సమస్త సహాయకృత్యములను నిర్వర్తించుచు నుండఁగలవారు. కావున నీవు చిత్రరేఖాద్వితీయవై సిద్ధాశ్రమప్రయాణమునకుఁ దక్షణము సాయితురాలవు కమ్ము. పొమ్ము. నీకార్యకౌశల్యమున సమ్మహార్షి తపమునకు విఘ్నముల నాచరించి రమ్ము.

మేనక:—(సంశయాకులితయై తనలో) ఆహా! సేవాధర్మరీతి. ఏలికలగు ప్రభువులు అత్యంతము గర్హితకృత్యములగు పరపీడాకృత్యములను చేయుమన్నఁ జేయక తప్పదుగదా! (అని తలవాల్చి నిలుచుండును.)

ఇంద్రుఁడు:—(సోత్సాహముగా) త్రిలోకసుందరీ! మేనకా!

ఉ. ఇంతవిచారమేల? మఱియెంత తపంబొనరించువారి క
త్యంతచలంబు లింద్రియము • లాశలనిండిన నెమ్మనంబు వి
భ్రాంతితమంబు వెల్వడలఁ•బారి చరింపఁ దలంచునంత నీ
పంతము దీర చూపులనె•పంబునఁ దూపులు జొన్ప నోపునే!

మేనక:—అయినను ఈసేవకురాలి యసమర్థతనంతయుఁ దూలించి సింహాగర్జనమే గిరిగుహాంతరాంతములగు మత్తగజంబులను చెండాడఁగల యట్టులుగాఁ దమయాజ్ఞయే నాచే నీమహాకార్యములను సాధింపనున్నదికాఁబోలును.

ఇంద్రు:—(సవైలక్ష్యస్మితముగ) నీ వినయమధురములగు మాటలు మమ్ముఁ దనియింపఁ జేయుచున్నయవి. పొమ్ము. నీనిర్వర్తించు మహాకార్యమూలమున మేమందఱము కృతార్థత నెనయఁ గలము.

మేన:—చిత్తము. దేవరయానతిని శిరసావహించితిని. (అని ప్రణమిల్లి చిత్రలేఖతోఁ గలసి వెడలి పోవుచున్నది.)

ఇంద్రు:—అయ్యా! కమలాననా! దివ్యర్షీ నారదా! మేనక తనకటాక్షబాణముల విశ్వామిత్రుని జయించి వశపఱచికొనగలదు. ఇఁక మన మీ భయమును వీడవచ్చునుగదా!

బ్రహ్మ:—మహేంద్రా! నీయంతటివాఁడు త్రిలోకాధిపతియై యుండగా భయమెక్కడిది? ఇఁక నేను నాలోకమునకేగి యథారీతినుందును. కార్యము సిద్ధినొందగనే మనము మఱలఁ గలసికొందము. (అని లేచుచున్నాఁడు.)

నార:—దేవేంద్రా! నేనిఁక సిద్ధాశ్రమప్రాంతములకేగి తపోభంగనాటకమును వీక్షించెదను. కావున నాకును సెలవిమ్ము. (అని బ్రహ్మతో ప్రయాణ మగుచున్నాఁడు.)

ఇంద్రు:—మీయుభయుల పాదపద్మముల నిదె మహేంద్రుఁడు ప్రణతుఁడగుచున్నాఁడు. (అని మ్రొక్కును.)

బ్రహ్మ:—
నార:— } సర్వవిధముల శ్రేయఃప్రాప్తి కల్గుగాక.

ఇంద్రు:—తమదయ యున్నంతవఱకు నాకు శ్రేయముల కెట్టికొదువయు లేదు. (సేవకులవైపు తిరిగి) ఎవఁడురా యక్కడ!

దౌవా:—(ప్రవేశించి) దేవర యాజ్ఞాపింపఁదగును.

ఇంద్రు:—వీరిరువురను పంపించిరమ్ము.

దౌవా:—(ఇంద్రునితో) చిత్తము దేవరయానతిసిదె నిర్వర్తించుచున్నాఁడను. (బ్రహ్మనారదులతో) మహాత్ములారా! ఇటు విచ్చేయుఁ డిటు విచ్చేయుఁడు. (అని త్రోవ జూపుచు బ్రహ్మనారదులతో నిష్క్రమించును.) (అందఱును నిష్క్రమింతురు.)

గద్య. ఇది శ్రీమత్త్రిభువనపవిత్ర గౌతమసగోత్రవతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భపారావారకళానిధి
శ్రీ కాశీనాథ విద్వత్కవి ప్రణీత
పూర్వశాకుంతలనాటకమునఁ
దృతీయాంకము.

---

# చతుర్థా[redacted]ము.

మేనక:—(చిత్రలేఖతో నాకాశయా[redacted]ప్రవేశించి) సఖీ! [redacted]యభినివేశమున బ్రాహ్మణ్యంబు నార్జి[redacted]రిన విశ్వామిత్రు[redacted]చలించునో కదే!

చిత్ర:—(చిఱునవ్వుతో) స్వశక్తిఁ దెలియక యడిగెదవు కదే!

గీ. ఎల్ల తపసుల యుల్లంబు ♦ జల్లురనఁగఁ
 దల్లడిల్లుచు మొఱఁడైనఁ ♦ బల్లవింప
 మెల్లమెల్లన నమృతముఁ ♦ జల్లుచుండు
 సరసగానపాట నీదెగా ♦ జలజనయన!

మేన:—(సవైలక్ష్యస్మితముతో) చెలీ! మనమిచ్చటఁ బడయుటకంటె నా విశ్వామిత్రుఁడు తపంబొనర్చెడి స్థలసమీపమునకే పోయి విహరింతము రమ్ము. (అని పరిక్రమించును.)

చిత్ర:—(క్రిందకుఁజూచి) సఖీ! ఫల భర వినమ్ర తరుచ్ఛాయా నివారితాతపంబును విమలజలాశయసమృద్ధంబునగు సిద్ధాశ్రమప్రాంతమునకిదె వచ్చితిమి. ఇచ్చటనే విశ్వామిత్రుఁ డుండఁ గలండు. మనమిచట నీ విమానము డిగి విహరింతము. (కొంచెము ముందునకు చూచి) చెలీ! చూడుము చూడుము. వాడుగో భస్మత్రిపుండ్రాంకితలలాటుఁడై జపమాలఁ ద్రిప్పుచు విశ్వామిత్రుఁడు తపము నేయుచు నున్నవాఁడు.

మేన:—(సవిస్మయముగఁ జూచి క్రిందకు దిగి) మనము నిచ్చటనే మధుర సరస సంగీత సల్లాపములతో విహరింతము. (అట్లు చేయుదురు.)

చిత్ర:—మంచిది. సఖీ! ఏదీ అమృతాయమానముగ నొక యార్యాగీతిని పాడుము. సరసచిత్తముఁ జల్లవింపఁజేయుటలో గానముకన్న మిన్న లేదు కదా!

మేన:—మనముభయులము భాషాంతరము నాశ్రయించి పాడుదము.

చిత్ర:—అట్లే కానిమ్ము.

(ఆర్యాగీతి-రాగము శౌరసేని)

శ్లో. జువజణ ణివహా దుఅంతో
మేన:—
చిత్ర:—
ణివసయి వణయిహా దావవసంతో,
ణవణవ రమ్మవణంతో
మళఅసమీార విఆరదిఅంతో.*

చిత్ర:—(గానమును ముగించి) సఖీ! అల్లదె యా దేవదారు వృక్షవాటిక దక్షిణభాగమున విహరింతము. శిష్యగణసహితుఁడై విశ్వామిత్రమహర్షి యచ్చటనె దపము సేయుచున్నాఁడు. (అని నాట్యమున నట్టులు చేయుచున్నారు.)

ఇయ్యది విష్కంభకము.

(భస్మత్రిపుండ్రాంకితలలాటుఁడయి జపమాల ద్రిప్పుచు శిష్యసహితముగా విశ్వామిత్రుఁడు ప్రవేశించును.)

విశ్వా:—(ప్రక్కకుఁ జూచి) ఓయీ యజ్ఞదత్తా! నీవీవనమునందు వెతకి దేవతార్చనమున కుపయుక్తములయిన పుష్పములను కోసికొని రావల

* ఛాయా:—శ్లో. యువజన నివహా దురంతో
నివసతి వనఇహా తావద్వసంతః,
నవనవ రమ్యావనాంతో
మలయసమీార విహారదిగంతః.

యుండును. ఇయ్యది సిద్ధాశ్రమము కదా! ఇచ్చట చేసినతపము శీఘ్రముగ సిద్ధినొందగలదని నాకు విశ్వాసము కల్గుచున్నది.

ఉ. ఈవనభూమి ఘోరతపమేర్పడఁ జేసెదఁ బాసి రోసముల్
స్థావరజంగమంబులునుఁ దల్లడమందఁ బ్రపంచమంతయుల్
బావనమైన బ్రాహ్మణత బాగుగఁ జెంది వసిష్ఠుతో సముం
డై విలసిల్లెదర్ సురలు నచ్చెరువొందెడి ధైర్యసంపదన్.

కావున నేనుండు నీవనప్రదేశమునకు పురుషులుగాని స్త్రీలుగాని యెవ్వరు వచ్చినను నాతపస్సునకు విఘ్న మాపాదిల్లును. విజనముగ నున్నచో నిస్సంగతఁ జేకూర్చి మనస్సునకు ఏకాగ్రతనిచ్చి తపోనిష్ఠ కానుకూల్యమునుఁ జేకూర్చును. కావున నీవీప్రవేశమార్గమునఁ గాపుండి జాగరూకతతో లోనవచ్చువారిని రానీయక నిరోధించి యుండునది.

మేన:—చెలీ! వింటివికదా యీతని ప్రగల్భోక్తులు. మఱియుఁ గంటివా ఆవేషమును నందలి ధైర్యసారమును?

చిత్ర:—సఖీ! ఎంతవిచ్చిదానవు! ఒక చిన్నరహస్యము చెప్పెదను.

క. తొలిని ప్రతిజ్ఞావాక్యము
బలికిన పురుషుండు క్రియను ఫలితముఁ గనునే?
బలుకనివాఁడే శక్తుఁడు
జలముల వర్షించు వార్షజలదము భంగిన్.

విశ్వా:—(ప్రవేశించి తనలో) ఈవనమెంతయు నిర్జనమై శాంతమై యున్నయది. ఇచ్చోటఁ దపంబొనర్చి బ్రహ్మర్షిపట్టముఁ బడయుటకుఁ దగినటులఁ బ్రవర్తించెద గాక (అని దర్భాసనాసీనుండయి కొంచెమాలోచించి) అయ్యయో! ఎట్టికాలమున కెట్టియవస్థలు వచ్చునో యెరికిఁ దెలియదుకదా! నేను సప్తాంగ రాజ్యమువీడి యిట్లిచ్చట నష్టాంగ

యోగరాజ్యము నవలంబింపవలసివచ్చెను. సింహాసనమున సుఖము మెఱుఁ గూర్చుండువాఁ డిప్పుడిచ్చటి కఱకురాలలో దర్భాసనమున నుపవసింపవలసివచ్చినది. కట్టా! (అనికన్నులు మూసికొని ప్రాణాయామముఁ జేసి తపమొనర్చు చుండును.)

చిత్ర:—సుందరాంగీ! మేనకా! మనమిపుడు తిరస్కరిణీ విద్యాప్రభావమున నంతర్హితలమై యున్నవారము. మనలఁ జూడ నేరికిని శక్యముకాదు. మనలనెవ్వరేమియుఁ జేయఁగాఁ జాలరు. కనుక మఱొక్కయార్యాగీతిని గానముఁ జేసితివేని ఈతని చిత్తమొక్కింత సంచలింపఁగలదని తోఁచుచున్నది.

మేన:—అట్లయిన నిదిగో పాడుచున్నదానను.

శ్లో. సందర్శితా రసికతా, భ్రమర! యదేతావతా చ కాలేన
ప్రతివీక్ష్య చూతకలికా,వికాససమయే విసర్జితా భవతా.

చిత్ర:—చెలీ మేనకా! నీగానంపు మాధుర్యమున నివ్వనమంతయుం మోసులెత్తుచున్నయది. రాలుఁ గఱఁగుచున్నవి. ఇఁక నిట్టెస్థితిలో లేశమాత్రుఁడగు నొకపురుషుని యందునను జడదారియైనవాని చిత్తము ద్రవించుట యేపాటిది!

విశ్వా:—(మెల్లమెల్లనఁ గనులు విప్పి చూచుచు) యజ్ఞదత్తా! యజ్ఞదత్తా! ఇటు రమ్ము.

యజ్ఞ:—గురువరా! ఇదిగో వచ్చితిని ఏమియానతి?

విశ్వా:—ఎవ్వరో ఇచ్చటఁ బ్రవేశించినట్టులున్నయది. పాడుచున్నారు వినుము. నీవు ఆశ్రమద్వారమున నుండి వారిని నిరోధింపవైతివి. ఏమి చేయుచున్నావు?

యజ్ఞ:—గురువరా! నేను పుష్పములకై పోయినప్పుడు ఎవ్వరైన వచ్చి ప్రవేశించి యుండిరేమో! యెఱుంగను.

విశ్వా:—మంచిది ఆవిషయము నట్లుంచుము. దేవపూజాసమయ మాసన్నమై నది. పుష్పములఁ గోసికొని వచ్చితివా?

యజ్ఞ:—గురువరా! వనమంతయుఁ గలయ వెదకితిని. ఒక్కపువ్వైనఁ గానరాదు.

విశ్వా:—(నలువంకలఁ జూచి) ఓయీ! ఎంతవింతగనున్నది. ఇదిగో! వన ప్రదేశమంతయును వికసితావికసిత సకలకుసుమపరిమళ మిళితమై కన్పట్టుచుండగా నీకన్నులకు పుష్పములే లేవని యెట్లు కన్పట్టుచున్న దోయీ!

యజ్ఞ:—(విస్మితుఁడై కలయఁజూచి) అయ్యో! ఇదియేమి ఆశ్చర్యమోకాని ఇంతకు నొకక్షణముముందు మోడులైయున్న యీవనపాదపములు ఒక్కక్షణకాలములో నెంతచిత్రముగ పుష్పసమృద్ధములై యొప్పుచున్నవి! ఇదియంతయును నిరంతరపరివృద్ధమగు తమతపస్సుయొక్క ప్రభావమని యెంచుచున్నాఁడను.

విశ్వా:—అగుఁగాక. నీవు జాగరూకతతో నాశ్రమద్వారముననుండి కాపాడుము.

యజ్ఞ:—చిత్తమట్లే యుందును. (అని నిష్క్రమించును.)

మేన:—చెలీ! చూచితివికదా!

చిత్ర:—అయిననేమి? కానిమ్ము. మఱల నింకొకగీతిక నుపక్రమింపుము.

మేన:—ఈమాఱు మనముభయులము కలసి పాడెదము.

చిత్ర:—అట్లే చేయుదము.

శ్లో. జువజణ జీవణ దుఅంతో

మేన:—
చిత్ర:—

జీవసఇ వణాఇహా దావవసంతో,
ణవణవ పమ్మువణంతో
మళఅసమీర విఆరదిఅంతో.

విశ్వా:—(ఆకర్ణించి) ఆహా! ఇయ్యది ఏదేని దివ్యసుందరుల గానవిశేషమో? లేక చూతపల్లవాంకురాస్వాద కషాయిత కలకంఠములగు పుంస్కోకిలల పంచమధ్వనిచే సమ్మిశ్రితమైన మోహగీతియో? ఈరెంటిలో నేదైన నొక్కటి కావలయును. (స్వస్తికాసనమును సడల్చి) అక్కటా! మహోత్కృష్టములగు కార్యముల కెంతలేసి విఘ్నపరంపరలు కల్గుచున్నవి! ఇస్స్ (అని నిట్టూర్పు పుచ్చి)

ఉ. ధైర్యనగంబు ద్రవ్వి యల•ధర్మపథంబను గట్టు గొట్టి స
త్కార్య తరుప్రకాండము పె•కల్చి పదార్థ పరిభ్రమభ్రమా
దార్యములన్న సుళ్ళఁబడి • తల్లడిలంగను జేసి సంతతా
వార్యరయంపు మోహనది•వర్తిలెముంచునో? లేక తేల్చునో?

చిత్ర:—చెలీ! కన్పెట్టితివా? తొల్లింటి ధైర్యసారము చలించినది. కోపము సడలినది. ఆస్థానమునందు ప్రసన్నముఖకాంతులు నిండుచున్నయవి!

మేన:—అగును. నిజమే. పైఁగా మన వసంతుఁడు కూడ మనకు తోడు వచ్చుచున్నాఁడు. ఇఁకను కార్య మయత్నసిద్ధమనుట నిక్కము.

విశ్వా:—(స్పర్శసుఖము నభినయించుచు) ఆహా! ఉపవాసక్లేశమునకు పాల్పడిన యీయంగముల కీ చల్లనిగాలి యెంతసౌఖ్యము నొనఁగూర్చినది. హాయి హాయి!

సీ. మలయాలయ కిరాత•లలనాకుచపటీర
కల నజస్రమవారిఁ • గాంచి కాంచి
కాసారగత సార•సాసార మకరంద
సౌరభమ్ముల మఱిఁ•చల్లి చల్లి
మలయాలయ భుజంగ•లలనా ముఖనిపీయ
మానమై యొక్కింత • మందతఁ గని

ప్రణయకోపములతోఁ • బతిపీడు సుదతుల
మానగంభీరత • మాన్పి మాన్పి

గీ. అలరువిల్తుని కలయిక • కలరఁ జేయు
వకుళ ముకుళ పరిమళ•వాహ మగుచు
విరహిజనముల నిట్టూర్పు • వెలయఁ జేసి
మలయ మారుతమదె వీచె • ముదులు నిండ.

సర్వతః పరిభ్రమించు నీహృదయగజమును మఱలింపఁ జేయుటకు నాకు వివేకాంకుశము చేఁజిక్కకున్నయది. ఏమిచేయుదు ? అయ్యయో ఇంద్రియ బలమెంత విచిత్రమగు దుర్జయము !

శా. దారాపత్యధనాశలన్ వదలి మో•దంబొప్పఁ బర్ణానిలా
హారాపేక్షకులై వరాహముఖ స•త్త్వాక్రాంత ఘోరాటవీ
ధీరాకారత సర్వకాలము తపో•దీక్షాపరుల్ మాదృశుల్
నారీగానముచేఁ జలాత్ములగుటల్ • న్యాయంబె యూహించినన్.

చిత్ర:—చెలీ ! మఱల నింకనొకమాఱు స్వరసంయోగరూపముగఁ బాడినచో నితనిచిత్త మత్యంతము రక్తము కాగలదు.

మేన:—మధ్యమ నిషాదముల వర్జించి మహాకవిప్రయుక్తమగు స్వరసంయోగమును పాడెదను.

* క. సాగరి సరిగ గరిగ సరి
గా గా గగరి గగ గరిప•గగ సరి సరిగా
సాగారి సారి గాధప
సాగస్సా గాధగా ధ•సారి గగరిగా.

---

* ఈపద్యమున కియ్యది ప్రతిపదార్థము:—సాగరి = మహాలక్ష్మికి, సరిగ = సమముగా. గరిగ=గరళముగలవానిని పొందినది (గరం=విషము. విష

విశ్వా:—(స్వ) ఇన్స్! మిక్కిలి మధురమగు నీస్వరసంయోగగీతికను విన్నది మొదలు. నాచిత్తము మిన్నకుండుటలేదు. ఏమిచేయుదును. (కొంచె మాలోచించి) కానిమ్ము. శ్రోత్రరంధ్రముల మూసి మఱల జపించెదను. (అని యటులం జేయును.)

చిత్ర:—చూచితివా చెచ్చెలీ! ఈతండు శ్రోత్రరంధ్రములమూసి ధైర్యము చిక్కబట్టుచున్నాఁడు. నీవు నితని భ్రమింపఁజేయ నిదియ తగిన యదను. ఇఁకను ఆవరణభంగవిద్యచే నిజరూపముఁ దాల్చి సమ్ముఖమున నిలువుము.

మేన:—నాబుద్ధికి నిదియె యుచితమని తోఁచుచున్నది. నేను నంతర్హితనై కించిత్స్పృష్టముగా నతని స్పృశించి, పిమ్మట నిజరూపమున నిల్చెదం గాక.

చిత్ర:—చెలీ! ఇట్టివిషయముల నాత్మబుద్ధియే సుఖకరమని పెద్దలు పల్కెదరు. కావున నీబుద్ధికిఁ దోఁచినట్టులు, మన ప్రభువు మెచ్చునట్టులును కార్యమును సాధింపుము. నేను నాకాశాంతరాళగతనై నీచాతుర్యమును గాంచుచుండెదను.

---

ముగలవాఁడు గరి. అనగా నీశ్వరుఁడు. అతనిని పొందినది గనుక) పార్వతి. ఆపార్వతికి, సరి=సమము, గాగా=అయిన, నీ గరిగ=ఈగజగమన (అనగా నిచ్చటనాయిక) యైన నాయిక యందు, గరిపగ = దట్టమైన కోపమును, గసరు = తీసివేయుము. ఈస్ = ఈర్ష్య, అరిగా=శత్రువుకదా, సాగారి= ఇంద్రుఁడు, సారి=విష్ణువు, వీరి,గాధ=చరిత్రను పరీక్షించువాఁడా! అగాధ గాధ=తెలియనలవిగాని దివ్యప్రభావముగలవాఁడా! సారిగ=విష్ణువుగాగ,రిగ= ఈశ్వరుఁడుగా (నై) నన్ను రక్షింపుము. అనగా నీశ్వరుఁ డర్ధాంగము నిచ్చినటులను విష్ణువు వక్షఃస్థలము నొసంగినటులను నీవును నన్నుఁ గృపాదృష్టిం గరుణించుమని తాత్పర్యము.

మేన:—అట్లైన గాలివాన వచ్చునేమో కదే!

చిత్ర:—అప్పుడు కథయే మానవచ్చును. (అని నవ్వుచు నంతర్హితయగు చున్నది.)

విశ్వా:—ఆహా! ఏదియో యొకతేజము కనులు మిరుమిట్లు గొల్పి యంతర్హిత మైనయది. ఆకాశము నిర్మేఘమగుటచే శంపాలతిక (మెఱుపు) కాఁజాలదు (అని యాలోచించుచుండును.)

మేన:—(మెల్లన వెనుకపాటున వచ్చి తనశరీరమును తాకించి మఱలుచుండును.)

విశ్వా:—(స్పర్శసుఖము నభినయించి, యంతలో సరోమాంచముగ సాధ్వస కోపములతో) ఆహా! ఫలభరవినమ్రశాఖాకిసలయ సుమసహితమగు లత వాతాహతిం గాబోలును నాపీపునకుం దాఁకి మఱల నాక్షిప్తమైనది. (ఆలోచించి) శాపభయమున వాయుమహోభూతముకూడ జంకినటులున్నది. (సవిచికిత్సితముగా) కాదు. ఫలభరమగు లతకాదు. గాలిలో విహరించు చక్రవాకమిథునమేమో! (మఱల పరిశీలించి) ఈస్పర్శసుఖము నొందినది మొదలు –

క. ఉల్లము తగ గడియారపు
ముల్లు తెఱంగునఁ జలించు•ముఖకరపాదం
బెల్ల చలింపక బాహ్యం
బుల్లసితంబయ్యె మోహ•ముజ్జ్రృంభితమై.

చిత్ర:—సెబాసు! సెబ్బేలీ! ఎంతదానవైతివి!

విశ్వా:—హూఁ. ఓయీయజ్ఞదత్తా! చూడుము మనయాశ్రమమున నెవ్వరో ప్రవేశించి పాడుచున్నటులున్నది. ఒకవేళ సుందరాంగియే యగునా?

యజ్ఞ:—(ప్రవేశించి) వనమంతయుం వెతకి చూచితిని. కాని నాకేదియుం గోచరింపలేదు. తమ తపఃప్రభావమునకు సంతుష్టయై యీవన దేవతయే యిట్లొనర్చుచున్నదేమో!

విశ్వా:—ఇంకను సుదూరము పరిభ్రమించి కనుగొని రమ్ము. పొమ్ము.

యక్ష:—(స్వగ) ఏదేని విఘ్నము కల్గియుండనోపు. లేనిచో నన్నిటు లింత దూర మంపునా? (ప్రకాశముగా) అయ్యా! అట్లేచేసెదను.

మేన:—(స్వగ) నేనిఁక నితని చెంతజేరి సంచరించెదను. (అట్లుచేసి) అన్నా! ఈతఁడు జటాధూసరారుణశిరోరుహుఁడును, భస్మచ్ఛురితసర్వావయవుఁడును నై యున్నాఁడు. అతిపరుషమైన యీతనిశరీర మీామృదుహస్తములచే స్పృశించుటయే కష్టముగా నున్నయది.

(ఆలోచించి ఇంచుక నవ్వి.)

క. జటిలుఁడుఁ బలితశిరస్కుఁడు
కుటిలుఁడు కుష్ఠాదిరోగ • ఘోరుం డైనన్
విటుని స్పృశింపక తప్పునె
యెటులైనను వారవనిత • కిది సహజంబో.

అయిన నింకొకమారు స్పృశించి యంతర్హితనగుదునా? (సంశయించి) అదిగో ఆతమాలము చాటుననుండి మృగబాధకు భీతిల్లినట్లార్తధ్వనిం గావించెదను. (ప్ర కా) అయ్యో! ఈదీనురాలిని రక్షించు పుణ్యాత్ము లెవ్వరు నిటలేరా? (అని ఆక్రోశించు చున్నది)

విశ్వా:—అయ్యయ్యో! ఎంతగ నిరోధించినను చంచలమగు నీమనస్సు కుదుటఁబడునట్టులు లేకున్నదికదా! (సపశ్చాత్తాపముగ)

ఉ. మీలితమయ్యెఁ జిత్త; మను • మీలితమయ్యెఁ దదేకవృత్తి; యు, న్మీలితమయ్యె సత్త్వ; మల • మోహపయోనిధి వృద్ధిఁ జెందె; యు, త్కీలితమయ్యెఁ గన్గవ వి • ఘూర్ణితమయ్యె సరోమకంటకో, త్కీలితమయ్యెఁ గాయమిఁక • దీనత యబ్బురమయ్యె నయ్యయో!

మేనక:—(మఱల వెనుకటివలె నాక్రోశించు చున్నది.)

విశ్వా:—(శ్రుతినభినయించి) ఏదియో యార్తధ్వనివలె నున్నది.

మేనక:—(నేపథ్యమున) మహానుభావులగు భూతదయాళువులారా! రండు రండు శరణంటిని రక్షింపుడు. అయ్యో! ఈదీనురాలిని రక్షించు పుణ్యాత్ములెవ్వరు నిట లేరా?

విశ్వా:—కరుణాక్రందనము! పైగా శరణమని వినఁబడుచున్నది. శరణాగత రక్షణమూకంటెను మించిన పుణ్యమేమి యున్నది?

మేనక:—(ప్రవేశించి) ఆర్యా! శరణమునొసంగి రక్షింపుడు. అనాథను. (అనుచు నిజరూపమున నిల్చుచున్నది.)

విశ్వా:—(స్వగతమున నామెను కన్నారఁ జూచి)

చ. సరసిజమాజలాశయము; ♦ శారదమౌ శశిబింబ మంకితం
బఱయ నబోధమౌముకుర ♦ మా, యసమానముగాదె!
యేది యౌ, తరుణిమొగంబుతో సమతఁ ♦ దాల్చు పదా
ర్థము, నెంచిచూడఁగా, మరుఁడు సృజింపఁబోలు విధు♦మం
డల మంకములేక ప్రాజ్ఞమున్.

సీ. కలనింపు మైసొంపు ♦ బలుపెంపు బోమనంపు
నసల నున్ననతెంపు ♦ గనుటకింపు
కచభార మరసార ♦ ఘనవారమును గేరు
మొగమారయ గసార ♦ సగతి మీరు
నతిలీల దృగ్జాల ♦ మణిమాల రుచినేలు
కుచలీల కులశైల ♦ కులముఁ బోలు;
పొలుపారు నూగారు ♦ పలుతీరు దనరారు
రమ్యోరువుల తీరు ♦ రంభ మీఱు;

గీ. నింత సౌందర్యవతియైన ♦ నింతికంతు
కులికి కులికి దయజిలికి ♦ పలికి కలిపి

మదివలపు దెల్పి యామీద ♦ మఱువరాని
మోహమున నన్నువలచెనో ♦ ముదితహృదయ.

(కొంచెము పరిక్రమించి) లలితలావణ్యముల కిక్కలగు నీయవయవములు మిగుల మనోహరములు. సుర కిన్నర గరుడ గంధర్వాది దేవ విశేషుల కన్యకలలో నొక్కతెయై యీమె యుండఁ బోలును. ఈమె ముఖకమలమును వీక్షించిన మాత్రాననే నాచిత్తమత్యంతము చంచల మగు చున్నది. (ప్రకాశముగా - మేనకవైపు మఱలి) సుందరీ! నీ వెవ్వరవు? ఈవనమున కేమి ప్రయోజనము నర్థించివచ్చితివి? నిజము పల్కుము.

మేన:—(స్వగ) చిక్కు తటస్థించినది. నిజమును పల్కితినా నన్నెక్కడ శపించిపోవునో గదా! అయినను స్త్రీలు కపటనాటకసూత్రధారిణులన్న మాట ఇదివఱకే గలదు. అందునను మానభంగాదులందు పల్కెడి యసత్యము పాపము నాపాదింపదందురుగదా! కాఁబట్టి (కొంచెము ఆలోచించి) ఇట్లు చెప్పిచూచెదను. (ప్రకా) మహాత్మా! వందనము జేయుచునున్న దానను. నావృత్తాంతమును దేవరసన్నిధిని మనవిచేయుచున్న దానను.

విశ్వా:—సావధానులమై యున్న వారము.

మేన:—(లజ్జానతయై) ఆర్యా! భూరిశ్రవుండనెడి రాజు కలం డతఁడు మిక్కిలి పరాక్రమశాలి. ఆయనపుత్రికనుగా నన్ను తొలుదొల్త నెఱుంగగా వలయును.

విశ్వా:—మంచిది. తరువాత?

మేన:—ఆమహారాజు నాయెడఁగల ప్రేమాతిశయమున నన్ను వెంటఁ బెట్టుకొని మృగయార్థియై వనంబులఁ గ్రుమ్మరుచు నిచ్చోట నన్నొక స్థలమునడించి యాతండు మృగయారతుం డైనాఁడు.

విశ్వా:—తరువాత !

మేన:—(గద్గదికతో) దైవవశమున నాతఁడా ఘాతుకమృగముల పాలఁబడి మడిసెనో యేమో తెలియదు. నేనును మూఁడుదినములు నతనికై ప్రతీక్షించుచు ఫలమూలముల నశనముగా గల్గి మఱలిపోవుటకు నగరమార్గము నెఱుంగక యిట్లు భ్రమించుచున్నాను.

విశ్వా:—పాపము ! ఎంతటియాపదనొందితివి ? కానిమ్ము. శోకింపకుము. గడచిన పనికై విచారింపకుము. (అని యూరడింప బోవుచున్నాఁడు.)

మేన:—మహానుభావా ! ఈమాటలు తమతపములకు విఘ్నముల నాపాదించునేమో. కావున నాయందు గటాక్షించి యానతి నొసంగినచోఁ జనియెదను. (అని యవ్వలిమోమై ప్రణమిల్లి సవిలాసముగ వెడలిపోవుచున్నది.)

విశ్వా:—(స్వగ) తపోవిఘ్నార్థము దేవతలు చేసిన తంత్రమని తలంచి తొలుదొల్త శపింపఁదలంచితిని కాని విచారణచేసినకొలఁది నట్లుచేయకుండుట కొంత మేలైనది. (కొంచెమాలోచించి) స్త్రీ సాంగత్యము అనర్థహేతువును తపోవిఘ్నపాదియును కాదా ? (మఱికొంతతడవు చింతించి) కానిమ్ము. తపమునకేమి ! యీకన్యారత్న మత్యంతము దుర్లభముకదా ! కావున (అని సంభ్రమముతో లేచి - త్రోవకడ్డుగానిల్చి)

చ. నిలునిలు బాల ! యేల రజనీకరజైత్ర ముఖంబటుంచెదో
కలికి ! నివాసనామములఁ ♦ గన్గొనగోరితిఁ దెల్పవే సఖీ
కలితము గాగవచ్చుటకుఁ ♦ గారణమేమిపు డెందునేగెదో
తెలియఁగఁ జెప్పవే మదన ♦ తీవ్రశరాభకటాక్షమాలికా !

మేన:—మహానుభావా ! నిర్మోహులగు తమకు నాయూరును పేరును ఏల వినదగును ? మాసంబంధులు వినినచోఁ బరిహసించి పరిత్యజింతురు.

(అవిశాంచెము ప్రక్రమించి సోత్సాహాస్మితముగ) మహాత్మా! మా బోంట్లతో మాటాడుట తమయట్టివారికిఁ గానిపని. ఇట్టిసరసాలాపములు సర్వథా తమతపములకు విఘ్నకరములు. కావున దయతో తామనుమతినీయ వేఁడెదను. నేను వెళ్లెదను.

విశ్వా:—(దీర్ఘముగా నిట్టూర్పువుచ్చి) సుందరీ! వేఱె చెప్పనదేమున్నది? అయినను నాదగుదృఢనిశ్చయము నిదిగో చెప్పుచున్నాను.

ఉ. నాతిరో! యీద్విజన్మఋషి • నామముఁదాల్చఁగఁ జేయు
వైభవో, దూ్ఖతతఃంబు భ్రష్టమయి • పోయినఁ బోవఁగని
మ్ము; నమ్ము నీ, వాతెఱఁ బంటనొక్కుచు న•వం బమృతం
బును గ్రోలిసోలి వి,ఖ్యాతి దలిర్ప దేవఋషి • నయ్యెద నీ
కృపనేను తొయ్యలీ!

మేన:—(లజ్జానతయై చిఱునవ్వునవ్వి) పరస్త్రీసేవనము సర్వులకును సర్వథా నిషిద్ధమగుచుండఁగా మిముబోటిధర్మజ్ఞులగు ప్రాజ్ఞులకిది యుక్తమగునా? ఇంతియగాక-

తే-గీ. ఆయురైశ్వర్య కీర్తుల • నపహరించు
పరసతీ సంగమంబని • ప్రాజ్ఞజనము
పరిహరింపంగ గని విని • ప్రతిదినంబు
తెలియగా నేరరెంతటి • ధీరవరులు.

విశ్వా:—సుందరీ! ఇఁకనీబోధనలు నాచెవికెక్కవు. ఈవిషయమున నన్నొరులు నిందించిన నిందింపనిమ్ము. తస్మాలమునఁ బోసంగెడి పాపము పూర్ణముగాఁ బండనిమ్ము. సైరింపగలను కాని యీయలరువిల్తుని తూపులతాఁకున కెట్టులు సైరింపఁగలను? (అని చేయిపట్టుకొని బలాత్కారము సేయుచున్నాఁడు.)

మేన:—(కన్నులుమూసికొని పెడమో మగుచున్నయది.)

విశ్వా:—మనోహారీ!

ఉ. ఏమిటికింతలోన శరదిందుని ధిక్కృతిఁ జేయఁజాలు నీ
మోముముద్రిప్పి కన్గవను మూసితి విద్దిసహింపఁజాల నే
వేమఱు నాదువైఖరి నవీనతఁ జూచి మనంబు నాపయిన్
ప్రేమరసంబు జిల్కదొకో! శీతకురంగ విలోల లోచనా!

మేన:—ప్రాణనాథా! ఒకమాట చెప్పవలసియున్నది.

విశ్వా:—(స్వగ) ఆహా! 'ప్రాణనాథా'—యన్న యీమాట ఎంతటి యమృతమొలికించినది. నాశ్రోత్రేంద్రియములు నేటికిఁగదా కృతార్థతఁ జెందినవి. (ప్రకాశ) ప్రియసఖీ! తప్పక చెప్పుము. సావకాశతతో నున్నవాఁడ.

మేన:—లోకమునందు కాంతలు తొలుదొల్త పురుషుల రూపరేఖా విలాసాదులఁ జూచియు నాపైని కులవిద్యాధనాదుల జూచియుఁగదా అనురక్తలగుచుందురు. అట్టిస్థితిలో దర్భకూర్చవలెనున్న యీబవిరిగడ్డము-తైలసంస్కారాభావమున నరుణపింగళములగు నీజడలు - ఈవల్కలములు - నీవిభూతి - యీ రుద్రాక్షమాలలు నాబోంట్లకెట్టులనురాగ జనకములగును? కావున వీనినిఁ బరిత్యజించి రమ్యరూప వస్త్రాలంకారాదుల ధరించి నన్ను స్పృశింపఁగోరెదను. లేనిచో నాదారిని నన్ను పోనిండు. (అని చేయివిదల్చుకొని పోఁబోవుచున్నది.)

విశ్వా:—(ఆలోచించి - స్వగ) ఆహా! సన్యాసికి శిఖ మొదలుగా నెఱువు తేవలసిన దన్నసామెతకు పాత్రమునైతిని. (ప్రకా) సుందరీ! తపస్సిద్ధులమగు మాకిదియొక లెక్కయా? ఇదిగో నీకోర్కె నెరవేర్చెదను. (అని ధ్యానమగ్నుఁడగుచున్నాఁడు.)

మేన:—(దివ్యవస్త్రాలంకృతుఁడగు విశ్వామిత్రునిఁజూచి) ఎంతయాశ్చర్యము!

చ. సిగముడివైచి యందముగ ♦ శేఖరవైఖరిఁ బుష్పముంచి నె
మ్మొగమునఁ జక్కఁగాఁ దిలక♦ముం ధరియించి మఱింతశో
భగాఁ, దగిన మనోహరాంబరముఁ ♦ దాల్చి సుగంధవిలిప్తుఁ
డై త్వరఁగ, నగుమొగమొప్ప నన్నుఁగని ♦ నవ్వుచు వచ్చెడి
నేమి చిత్రమో !

(అని పరవశయగుచున్నయది.)

విశ్వా:—సుందరీ! నీయిష్టానుసారము ననురూపవేషుఁడనైతిని. ఇఁకనైన నన్ను దయఁజూడుము. (పైకి తలయెత్తిచూచి) సుందరీ! చూచితివా! అల్లదిగో అభినవ జలధరమాలికాచ్ఛన్నములై భూమ్యంతరిక్షములు కలసిపోవుచున్నవి. దిఙ్ముఖము లంధకారబంధురములయినవి. త్రోవయుం తెన్నును కానరాకున్నవిగదా! (అని విభ్రాంతుఁడగును.)

మేన:—(మిక్కిలి భయసంభ్రమముల నభినయించుచు) నాథా! ఈనిర్జనారణ్యము భీతిగొల్పుచున్నది. నన్నుఁ జేపట్టికాపాడుము. మీకు శుభమగుఁగాక. (అని ఆకాశమును వీక్షించి) గాలి వాన మహాప్రళయాకృతితో వచ్చుచున్నది.

విశ్వా:—సుందరీ! నిక్కమే. అల్లదిగో అటుచూడుము. ఆదిక్కునుండి—

సీ. జంఝూనిలోద్వేగ ♦ ఝుంకారసహకార
సహకారభగ్నోరు ♦ శాఖరవము
వర్షోపలాసార ♦ వజ్రప్రహారాతి
భిన్నపక్షితిపక్షి ♦ భీరునాద
మతిఘోరగంభీర ♦ భృతవారిదారావ
విస్తారగిరిసింహ ♦ వికృతిరవముఁ
బ్రబలవాతాహతి ♦ ప్రక్షేపవిపరీత
పతితశంకితగ్రహ ♦ ప్రౌఢరవముఁ

గీ. జటుల బడబాగ్ని విక్షేప ♦ చటచటాప్తి
ఘటిత పటుతర భంగౌఘ ♦ కలరవంబు
గలిగి జలధుల ఝూంకృతుల్ ♦ వెలయుచుండఁ
బ్రబలి నలుదెస నిదె గాలి ♦ వానగురిసె.

మేన:—(భయకంపముల నభినయించుచు) ప్రియతమా! నాథా! ఏమిసే యుదు - నశరణ్యనైతిఁ గదా!

విశ్వా:—ప్రాణప్రియా! వెఱఁగుపడకుము. ఇదె తృణీకృత బ్రహ్మపురందరుండగు విశ్వామిత్రుఁడు నీకు బాసటయై యున్నవాఁడు. నిశ్శంకముగా నీవీరాత్రి యీగిరిగుహాయందు శయనించి ప్రభాతముకాఁగానే నీపురమునకు నీవు మఱలిపోఁగలవు. భయపడకుము. భయపడకుము.

మేన:—(వర్ష బాధాధికతను రూపించుచు, తొట్రుపాటు నభినయించి) ఆర్యా! నన్నుకాపాడుము! అనాథను. (అని యతని భుజవల్లరిని బెనచుకొనుచున్నది.)

విశ్వా:—నెచ్చెలీ! భయములేదు రమ్మిటురమ్ము. (అని తానును మేనకను పట్టుకొని స్పర్శసుఖము నభినయించుచు)

ఉ. ఎంత తపంబుజేసి జని♦యించిన, వారికి నౌర దుర్లభం
బింతఫలంబు; స్వర్గమది♦యెక్కడ! మోక్షమదెక్కడో మహా♦
నంతఫలం బిదెక్కడ మ♦నంబు సుఖించుట యెచ్చటో తదే
కాంతముగాఁగ నయ్యదియ♦యాయపవర్గముగాక వేఱటే!

(అనుచు గిరిగుహాభ్యంతరమునకు నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్ర:—తిరస్కరిణిని తొలఁగఁద్రోసి ప్రవేశించి) సేనింతదనుక తిరస్కరిణీప్రభావమున నంతర్హితనై కన్పెట్టియున్నదానను. ఇఁక నిటుపైని

సత్వరముగా పోయి, యీచిత్రచారిత్రము నింద్రునికి ఎఱింగింపఁగా వలయును. (అని యాకాశాధిరోహణము నటించి నిష్క్రమించును.)

(అందరును నిష్క్రమించెదరు.)

గద్య. ఇది శ్రీమత్త్రిభువన పవిత్ర గౌతమసగోత్ర వతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భ పారావారకళానిధి
శ్రీ కాశీనాథ విద్వత్కవిప్రణీత
పూర్వశాకుంతలనాటకమున
చతుర్థాంకము.

---

# పంచమాంకము.

(యజ్ఞదత్తుని ప్రవేశము)

యజ్ఞ:—(నిద్రనుండి మేల్కనినవానివలె నభినయించుచు నావులించి నల్దిక్కులను బాఱఁజూచి) ఓహోహో ! రాత్రియంతయు గడచి తెల్లవారినటు లున్నది.

చ. శశియపరాద్రిఁజేరెనుదు ♦ సంతతిజాఱెఁ దమంబుబారెనల్
దెసలలరారెఁ బంకజము ♦ వేరె; రవిప్రభ లెల్లవాఱెఁ బ్రా
గ్దిశ గగనంపు కామిజన ♦ తీవ్రభుజార్పితబంధమూడె స
త్కుశలతఁ గేరె; గోకిపతిఁ ♦ గూడె; యులూకము దూరె సందులన్.

ఏమో ! ఈవనమంతయుం జలఝ్ఝావృష్టి గుఱియుటఁ జేసి కాబోలును విభగ్న విటపకిసలయ తరుప్రకాండమై యున్నయది. (స్మృతినభినయించి) ఆహా! మాగురువర్యుల తపమునకు విఘ్నము లిట్టులు ఈరూపముగా వచ్చెఁగాబోలును. ఆమహానుభావుఁడీబాధకోర్వఁజాలక తపము చాలించి యెటకేని పోయియుండును. అయినను వెతకి కనుగొందుగాక. (ఆవులించుచు గొంచెము నడచి - సాభిజ్ఞముగా)-ఇదిగో మాగురువర్యుఁడు తపముసేయుం ప్రదేశము ! (నిపుణముగాఁ బరికించి నిరూపించుచు ఖేదముతో) అయ్యయ్యో! గురువర్యుఁడిచ్చట నాఘోరాంధకారమున నేవన్యమృగముల బారింజిక్కెనోకదా ! (మఱియొకవంకఁ బరికించి) ఇదిగో అమ్మహానుభావుని భస్మోద్ధూళన ధూసరితమగు రుద్రాక్షమాల ! (ఇంకొకదిక్కువీక్షించి) ఇదియే యతనివల్కలము !

శాఖావలంబితమై యున్నయది. (మఱొకదిక్కున) ఇట దర్భాసనము అత్యంతలులితమై పరిత్యక్తమై యున్నయది. (వేసరికతో) ఎంతవెతకి ననేమి? అమ్మహాత్మునిఁ గానఁజాలనైతికదా! (సవితర్కముగా) ఊఁ! ఇయ్యది ప్రాతఃకాలమగుట నమ్మహర్షి స్నానార్థియై నదీతీరమున కేగి యుండఁగావచ్చును. కనుక నేనునచ్చోటికేగి యాతనిం దర్శించెద గాక. (అని ఖిన్నతతోఁ బరిక్రమించుచు- నంతలో శ్రుతినభి నయించి-ఆశ్చర్యముతో) ఈగిరిగుహాభ్యంతరమున నెవ్వరివో మాటలు వినఁబడుచున్నవి. వినెదనుగాక. (వినుట నభినయించి) ఏవో సరసోక్తులవలె నున్నవి. ఇందుల నాతఁడుండినను నుండఁగావచ్చును. అయినను చూచెదను. (చూచి విచికిత్సతో) మాగురువర్యుఁడే యగు నని సంశయము గల్గుచున్నది. (మఱల నిపుణముగాఁ బరికించి) సాదృశ్యమునకేమిగాని యాతఁడితఁడు కాఁడేమో యని తోఁచుచున్నది. ఏమనఁగా:—

సీ. అతనిమస్తకమున ♦ నంతట జడలుండె
నితనిమస్తకమున ♦ నింతసిగయ;
అతనిఫాలమునందు ♦ నంతభస్మపు పూఁత
లితనిఫాలమునందు ♦ నింతతిలక;
మతనిదేహము భస్మ♦కృతలేపనవికార
మితనిదేహము గంధ♦యుతతఁ బఱఁగు;

గీ. ప్రశమదమములు నుపవాస♦కృశము తనువు
నతని కితనికి తద్భిన్న ♦ మితఁడు రాగ
భోగయోగాస్పదంబగు ♦ పుణ్యమూర్తి
యెట్టులే నితఁడతఁడని ♦ యెంచిచూతు.

(గాఢముగ నిరీక్షించి) పైగా నితఁ డర్ధనిద్రాముద్రితారుణ నయనుఁడై ప్రియురాలితోఁ బ్రియోక్తులఁ బల్కుచు ప్రొద్దుపుచ్చు

చున్నాఁడు. ఈ యువతీలలామ యెక్కడిది? ఈమెయును రాత్రి సంభుక్తమదనకేళీలులితావయవ యైనట్లు ప్రమాణాధికశ్వాసలఁబట్టి యూహింపనగుచున్నది. అదిగో!

ఉ. జారిన పైఁటకొంగు బిగిఁజన్నవపై సవరించి యొక్కచేఁ;
దీరుగ లేనికొప్పు ముడిఁదిద్ది ధరించుచు; నొక్కచేతితోఁ
దూర్చియ నంజనంబు గనుఁదోయి ధృతారుణిమంబు శ్వాస
విస్తార చలత్కుచాగ్రమునఁ దాల్చుననంగుజయశ్రియో
యనన్.

కానిమ్ము. ఇంకను కొంచెము పరీక్షించెదను. (సాశంకముగ) వధూవరులగు కాముకులు మాటలాడికొను రహస్యపువేళల నొరులు సన్నిహితులు కారాదుకదా! (ఆలోచించి) ఒకవేళ వీరు సిద్ధవిద్యాధరాది దేవజాతులలో మిథునములేమో! కానిమ్ము. వీరితో నాకేమిపని? నేనీ నదీతీర పంసరారణ్యములందు గ్రుమ్మరి గురువుల జాడలఱయఁ బోయెదను. (అని నిష్క్రమించును.)

ఇయ్యది ప్రవేశకము.

---

(మేనకావిశ్వామిత్రుల ప్రవేశము.)

విశ్వా:—(ప్రక్కకుఁజూచి) ప్రాణసఖి! నీశరీరమైఖరిఁ జూడఁజూడ నాశ్చర్యమగుచున్నది. తొల్లి యిట్టులులేదు. నిపీతసాగర సలిలయగు మేఘమాలికఁబోలి మెల్ల మెల్లనఁ జరించెదవు. మాటిమాటికి నావులించి యొడలు విఱుచుచున్నదానవు. నిట్టూర్పులు అలసములయినవి. కారణ మేదియైయుండునో వినవలతును.

మేన:—(ఇంచుక నవ్వుచు) నేనెట్టు లెఱుంగగలదానను. (అని యూరకున్నది.)

విశ్వా:—సుందరీ! నీకు లజ్జగానున్నట్టులున్నది. అయినను నామన ముత్కటపడుచున్నయది. చూడుమీ దేహకాంతి వికసిత కేతకీదళమువలె పండఁబాఱినది. భృంగాధిష్ఠితాగ్రములగు కమలముకుళములవలె నీచనుదోయి కొనలు నల్లనైనవి. వళులెప్పటిరీతిని లావణ్యాతరంగముల వికసిల్లవు. దీనికిఁ గారణమెద్దియైన నుండక తప్పదు.

చ. వెలవెలఁబాఱె నెమ్మొగము ♦ వేకువనున్న సుధాంశురీతితో
నలసతఁజెందె నీయొడలు ♦ నయ్యెయొ జృంభణమేల మాటి
కీగా, వళులవిభాగముగా గనము ♦ వారిజలోచన మధ్యభా
గముగా, మెలఁగు గృశత్వముగా వదలి ♦ యించినదిప్పుడి దేమి
చెప్పుమా!

మేన:—(లజ్జాస్మితవదనయై-యంతలో గోపమునభినయించి) ఇంతకుఁ దమరే కారణమని యెఱుంగరు కాఁబోలును. (ఆకాశమువంక వీక్షించి) ఆకస మతినిర్మలముగ నున్నది. తమరాజ్ఞ నిచ్చిన మాపురంబునకు మఱలిపోయెదను. దయయుంచుడు. (అని పోఁబోవుచున్నది.)

విశ్వా:—(అడుగులు తడబడ నడచుచు) సఖీ! నిమేషమైన నిన్నెడఁబాయఁజాల. కావున నాయొద్దనే యున్నచో మిగుల సుఖింపఁగలను.

మేన:—అట్లేని మహాత్మా! ఒక్కక్షణ మిచ్చటనయుంచుడు. ఇదిగో ఇప్పుడే వచ్చెదను. (అని చాటునకుఁ బోవుచున్నది.)

విశ్వా:—(విరహము నభినయించి బెదరి బెదరి చూచుచు)

ఉ. ఎక్కడి యీయకార్య; మది ♦ యెక్కడ నాదుకులంబు
గ్రమ్మరగా, జక్కనయింతి కన్పడునె ♦ శాస్త్రము దోషప్ర
శాంతికై గదా!, యక్కుటిలాలకాస్య మిఁక ♦ నాగ్రహ
మొప్పిన నందమేకదా, యక్కట! ధన్యుఁడెవ్వఁడిఁక ♦ నయ్య
ధరామృతమంతఁ గ్రోలునో?

ఆకాంతామణి నాయందంతగా ననురక్తయైనది. నన్ను విడువనోపునా? (సవిశ్వాసముగ) పరిహాసమున కిటయెందేని దాఁగియుండఁబోలు. వెదకుదునా? (పరిక్రమించి) ఓహో యీమాలతీలత నాకెచ్చెలిని దాఁచి కుసుమకాంతి మిషచే నన్ను పరిహసించుచున్నది కాఁబోలును. (భ్రాంతి నభినయించుచు.) అదిగో యత్తన్వి నెటకొప్పు! (సమీపించి- ఖేదముతో) భ్రమసితిని. ఇయ్యది తుమ్మెదలగుంపు. ఇచ్చట లేదు. (అనుమానముతో) ఇఁకఁ గానరాదు కాఁబోలును. అక్కటా! ఏమిసేయుదును. (పశ్చాత్తాపముతో) అన్నన్నా!

క. శుభదంబైన తపంబువోయె; వలపుల్ •సూచించి తాఁబోయె నన్నుభయ భ్రష్టునిఁ జేసి యింతి యవురా!-

(కోపము నభినయించి)

... ... ... ... ... •యూహింప నమ్మంగరా దు భువింగాంతల నించుకొంతరతిచే• దూలించి పాలింప ర క్షుభితంబొప్ప (సదయముగ) మనంబు రక్తమగుటన్ •కోపింతు రే మాటకిన్.

(చింత నభినయించి) కానిమ్ము. (సవిచికిత్సితముగా) స్నానార్థినియై సరోవరమునకేగినను ఏగియుండవచ్చును. నేను నచటికిఁబోయి వెతకి కనుగొందును. (అని నడచుచు- శ్రుతినభినయించి) అల్లదిగో దేవదారువనరేఖకు దక్షిణభాగమున పసిపిల్ల యేడుపేదో వినవచ్చుచున్నది. (విని) రోదనధ్వని గంభీరమై స్త్రీవ్యక్తిత్వమును చాటుచున్నది. అటుపోయి చూచెదను. (అని ముందునకు నడచి) ఆహాహా! బాలాతపవికసితారవిందములఁబోలె యెఱ్ఱనైన హస్తపాపముల దూలించు నిసుగును చేతులపై నుంచికొని యెవ్వరో వచ్చునట్లున్నది. (ఆనందముతో) నాప్రాణసఖివలె నున్నది. సద్యోగర్భమున శిశువుఁగన్నది

కాబోలును. (హర్ష పరవశతతోఁ గన్నులుమూసికొని) ఇఁక మా యిరువురి యంతఃకరణములును నీప్రేమపాశమున దృఢసంబద్ధములు కాఁగలవు. (కన్నులు తెఱచి) పోయిచూచెదను. (అని వచ్చుచున్నాఁడు.)

మేన:—(అలసినయొడలుతో సోచ్ఛ్వాసముగా బిడ్డనెత్తికొని ప్రవేశించి) ఇదిగో! నీతపఃఫలము. నీవ యిటుపై నీపిల్లను పోషింపవలసియున్నది. (అని చేతికిచ్చును.)

విశ్వా:—(నవ్వుచు) పురుషశిశువైన నట్లే చేసెదను కాని రోదనధ్వనింబట్టి యాడుశిశువని తోఁచినది. (అని తీసికొనుటకు నిరాకరించుచున్నాఁడు.)

మేన:—మీకిది తప్పనిసరి. తీసికొనుఁడు. (అని బలాత్కారమున నిచ్చుచున్నది.)

విశ్వా:—(పెడమొగమున-నంజలిఁబట్టి చేకొని) సజాతీయత్వ సంబంధముఁబట్టి స్త్రీలకు స్త్రీసంతతిపై ప్రీతి మిక్కుటముకదా! నీవే దీనిని చేకొని పెంచుము. (అని మఱల ఇవ్వఁబోవుచున్నాఁడు.)

మేన:—(కోపముతో) తండ్రివగు మీకే అంత వెక్కసమైన నాకేల? (అని దిగవిడిచి పోవుచున్నది.)

విశ్వా:—ప్రాణప్రియా! వినుము. ఒక్కమాట! పిల్లలనుపోషింప నాకు శక్యముకాదు. పైన నిన్నెడఁబాసి నిముసమైన నోర్వఁజాలను. నేను నీవెంటనవచ్చెదను. (అని చీరకొంగుపట్టుకొని వెంబడించును.)

మేనక:—(మిక్కుటమైన కోపము నభినయించి) చాలుఁజాలు నీవింతలు! నామానమర్యాదలకు భంగముఁ దెచ్చితిరి. ఇఁకనైనను నన్నువిడువుఁడు. మాపెద్దలు విన్న నీకును నాకును మానప్రాణములు దక్కవు. ఈపిల్లను నీవే పోషింపవలయును, తప్పదు. (అని చీరకొంగు లాగికొని పోనున్నది.)

విశ్వా:—ప్రాణసఖీ! నిన్నువీడి నే నఱనిమసమైన నుండఁజాలను. నేనును వచ్చెదను. (అని బలాత్కరింపఁ బోవుచున్నాఁడు.)

మేన:—(ససంభ్రమముగ పైఁటకొంగు విడుల్చుకొని పోఁబోవుచున్నది.)

విశ్వా:—(దీనముగా) చెలీ! నన్నువిడుచుట ధర్మముకాదు. (అని ప్రతి మాలుచున్నాఁడు.)

[తెరలో-తత్త్వమసి; తత్త్వమసి;]

విశ్వా:—(శ్రుతినభినయించి) దశమ స్త్వమసి యన్నట్లు నేనెట్టిడనై యెట్లు పరిణమించితినో ఈయాకాశవాణి బోధించుచున్నయది. (ఆలో చించి) దీనినిఁబట్టి జరిగినదంతయు మిథ్యయేమొ? (ధ్యానము నభిన యించి) ఆ! తెలిసినది. ఇది రాజకన్యకకాదు. తపోభంగార్థమై వచ్చిన మేనకయే. (కోపించి) కానిమ్ము. నాతపఃప్రభావముఁ జూపె దను. (శాపోదకములనందికొని) ఓ లలనా! నన్ను వంచించినందులకు ఫల మనుభవింపుము. నీవిచ్చట శిలారూపవై ఉందువుగాక. (అని శాపోదకముల చల్లుచున్నాఁడు.)

మేన:—(భయకంపములతో) అయ్యయో! పరిభ్రష్టనైతినిగదా! చేసిన ఫలమనుభవింపక తీరునా? (అని స్తబ్ధురాలగుచున్నది.)

విశ్వా:—పరశ్రేయమును ఓర్వఁజాలని ఇంద్రుని ఈదుర్వృత్తి నేమనవల యును?

మ. అలముల్లోకములందు హెచ్చు త్రిదివం • బందుండు స
ర్వాదితేయులు హెచ్చెగద వారిచే మిగుల నో•హాయం
చు సంస్తుత్యుఁడౌ, బలవిద్వేషికి దుష్టబుద్ధి మునులన్ •
బాధింపగా, నెవ్వరన్యుల శ్రేయస్థితి నోర్చువారు జగతిన్•
ఊహింపఁ గామాత్మకుల్.

(నేపథ్యమున)

"ఓయీ! శార్ఙ్గరవా! నదీమార్గముఁ జూపుము. సూర్యోదయమగుచున్నది. మునులెల్లరు స్నానార్థము వచ్చువేళయైనది?

విశ్వా:—(ఆకర్ణించి) ఎవ్వరో జలావగాహనార్థ మిచ్చటికి వచ్చునట్లున్నది. ఇఁక నేనిటనుండఁదగదు. అరణ్యాంతరమున కేఁగి బ్రాహ్మణ్య సంపాదనమునకై పునఃప్రయత్నముఁ జేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

కణ్వ:—(జరాశైథిల్య కంపముల నభినయించుచు ప్రవేశించి) ఓయీ! శార్ఙ్గరవా! చూచితివా. ప్రతిప్రాణియు తనకు నియతమగు వ్యాపారమున వర్తించుచున్నది. ఇదిగో ఈలేడి కష్టమునకు వెనుదీయక తన పిల్లల నైతము విడిచి, ఆహారమునకై పోవుచున్నది.

శార్ఙ్గ:—గురువరా! సర్వము స్వకార్యతత్పరమగుట స్వభావమేకదా? మనము సరస్తీరమును చేరితిమి. వికసిత పద్మషండవాసనావాసితమై ప్రాభాతవాయువు ఎంతచల్లగా వీచుచున్నది.

కణ్వ:—(కలయఁజూచి) ఓయీ! ఇట్లు చూడుము. ఈశకుంతనులు ఈ బాలికను తమఱెక్కలతో కప్పి క్రూరజంతువుల బారినుండి రక్షించుచున్నవి. ఆహా! భగవంతుని సృష్టిరక్షణవిధానము నెంతని కొనియాడఁగలము.

(అని సమీపించును.)

శార్ఙ్గ:—గురువరా! గంభీరమగు రోదనధ్వనినిఁబట్టి మనమూహించినట్లు ఈపిల్ల ఆడుపిల్లయే యైనది.

కణ్వ:—(కొంచెము విచారించి) "పుత్రాచ్ఛతగుణం పుత్రీ యది పాత్రే ప్రదీయతే" అని చెప్పినట్లు పెంచి పోషించి మంచివరున కిత్తము గాక.

(అని శకుంతలయొక్క సౌందర్యమునకు ముగ్ధుఁడగుచున్నాఁడు.)

శార్ఙ్గ:—ఇంతటి సౌందర్యవతియైన ఈదివ్యపుత్త్రికారత్నమునకు తలిదండ్రు లెవ్వరో ?

కణ్వ:—(ధ్యానము నవలంబించి) ఎవరైన నేమి చేయగలము.

శార్ఙ్గ:—గురువర్యా ! కన్నతలిదండ్రులు పిల్లనువిడిచిపెట్టుటచే నామనము శంకాక్రాంతమైనది. దయతో తెలుపవేడెదను.

కణ్వ:—(సహేలముగ నవ్వి) ఎంతవారికిని బుద్ధినిశ్చాంచల్యముగ నుండదు. విశ్వామిత్త్రుఁడు ప్రాక్కర్మవాసనావశమున క్షత్త్రియుఁడై యుండి వసిష్ఠునితోఁ బోరాడి అతని బ్రహ్మబలముముందట తనక్షాత్త్రము సాటిరాకుండుటకు వెతఁజెంది బ్రాహ్మణ్యముగోరి ఇచ్చట తపమొన రించెను. ఆతపమునకు వెరగువడి యింద్రుడు అతని తపము విఘ్న మొనరించుటకై మేనకనిచ్చటకుఁ బంపెను.

శార్ఙ్గ:—పిమ్మట నేమి జరిగినది ?

కణ్వ:—ఆప్రయత్నము ఫలితమే యాయెనువు.

శార్ఙ్గ:—గురువర్యా ! ఇంతటిపట్టుదలతో దపమొనర్చు విశ్వామిత్త్రుఁడు మేనకకు లొంగి తనతపమునకు విఘ్నము నాపాదించుకొనునా ?

కణ్వ:—ఓయీ ! చిత్తైకాగ్రత ఎంతవానికిని దుర్లభము. అందునను కామ నాసిద్ధికై తపములు సేయువారికి విఘ్నములు బహుళముగా సంభవిం చుటయు చిత్తము చంచలతనొందుటయు తప్పనివి గదా ?

శార్ఙ్గ:—(వికవిక నవ్వుచు) అట్లైన నతనిబ్రాహ్మణ్య మధోగతమైనదా ? ఐనను తలిదండ్రులు పిల్లను విడనాడనేల ?

కణ్వ:—అందుల కుత్తరము దైవమునడుగవలసియున్నది.

శార్ఙ్గ:—నిజము. ఇట్టి అర్భకులకెల్లరకును భగవంతుఁడే రక్షకుఁడు.

కణ్వ:—మనమిక యాప్రస్తావనను వదలి యాపిల్లను తీసుకొనిపోయి మన వృద్ధగౌతమి హస్తముల సమర్పింతము రమ్ము. బాలిక నెత్తికొనుము.

శార్ఙ్గ:—అట్లే (పిల్ల నెత్తికొని కణ్వునివెంట నడచును.)

కణ్వు:—(స్వగ) వనవాసులమై నిస్పృహులమైయుండు మాబోంట్లకును సంగదోషము తప్పదే మోకదా? అహా!

ఉ. బంధముఁ బాతునంచు నతిపావన మౌ వనమందుఁ జేర సం
బంధముగల్గి యీశిశువుపై యతివత్సలమయ్యె నామనం
బంధము పారతంత్ర్యమున నాకులమయ్యెను సంగదోష దు
ర్గంధ మహాప్రవాహగతి కన్నను దుష్టము వేరె యున్న దే.

(అని బాలికాసహితము శిష్యునితో కణ్వుఁడు నిష్క్రమించును.)

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య. ఇది శ్రీమత్త్రిభువనపవిత్ర గౌతమసగోత్రవతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భపారావారకళానిధి
శ్రీ కాశీనాథ విద్వత్కవిప్రణీత
పూర్వశాకుంతలనాటకమున
పంచమాంకము.

---

# షష్ఠాంకము.

(లావణ్యలహరి సఖీసమేతయై ప్రవేశించుచున్నది.)

లావ:—చెలీ! కనకాంగీ! ఈవనమందు సుదుష్కరమగు తపస్సు చేసి మఱల వారెప్పటిరీతి కన్యాత్వము నార్జించెదను. ఇయ్యది మునిజనముల కావాసయోగ్యమై తపోయోగ్యమై యున్నది. అవగాహనమునకు కమల పరిమళవాసిత జలాశయములును, విశ్రాంతికై ఛాయానివారితాతపము లగు వృక్షరాజములును, ఫలభరవినమ్రములైన తరుశ్రేణిగల పాదప ములును నిండియుండి మునిజన శుశ్రూషణమునకై వేచియున్నట్టుల తోఁచుచున్నవి.

కన:—నిక్కము. ఈయాశ్రమమహిమ మెట్టులున్నదో చూడుము. తరువులు సైతము కుసుమపరాగధూళిని నిండి భస్మచ్ఛాదితములై, వల్కలముల ధరించి మధువ్రతమాలికలనెడి రుద్రాక్షమాలికలఁ దపంబొనరించు మునిజనములవలె నున్నయవి.

లా:—అగును. కనకాంగీ! మనకియ్యదియే తపశ్చరణ కనుకూలమైన ప్రదేశము. ఉపదేష్టలు లభించిన నిచ్చోట శీఘ్రసంసిద్ధి కలుగగలదుగదా (అనియోచించుచు ముందునకు చూచి) చెలీ! అటుచూడుమావ్యక్తిని! మనుష్యదేహధారిణియగు వాణి నా, మూర్తీభవించిన యోగసిద్ధి నా దేజరిల్లెడిని కదే!

కన:—మన కార్యసిద్ధిని సూచించెడి ప్రత్యక్షదైవమువలె తోఁచుచున్నది.

సీ. చెంగావిగలచీర • శృంగారముగఁ గట్టి
యంగవల్లిక వింత • రంగులీన
భస్మత్రిపుండ్రాంక • ఫాలదేశముక్రింద
కుంకుమ తిలకంబు • కోమరుజెంద
కంఠదేశమునుండి • కడుపుక్రిందికి వ్రాలు
రుద్రాక్షమాల చే • భద్రయగుచు
పుస్తకం బొకచేతఁ • బొందుగా ధరియించి
యంగుష్ఠ తర్జను • లలవరించి

గీ. స్ఫటిక మణిమాలఁ ద్రిప్పుచు • జగము మిథ్య
బ్రహ్మ సత్యమ్మటంచును • బలుకుచుండి
మూర్తినొందిన సత్త్వంపు • ముద్దయనఁగ
సిద్ధయోగిని వచ్చెడి • శీఘ్రముగను.

మనము నామెను సమీపించి నమస్కరింతము రమ్ము.

సిద్ధ:—జయశాంకరీ! (అనుచుఁ బ్రవేశించుచున్నది.)

లావ:—
కనకాం:— } అమ్మా! మహాత్మురాలా! సాష్టాంగదండప్రణామముల గైకొనుము (అని సాగిలి మ్రొక్కుచున్నారు.)

సిద్ధ:— ఇష్టసిద్ధి యగుఁగాక! ఇష్టసిద్ధియగుఁగాక!

లావ:—
కనకాం:— } అమ్మా! మాకు ఇట్లు అనాయాసముగా దివ్యదర్శనము లభింపఁ జేసిన తమరెవ్వరో ఈదీనురాండ్రకు విన్పించి ధన్యలను జేయుందురా?

సిద్ధ:—నాపేరు సిద్ధయోగిని యనియనెదరు. మీరెవ్వరు? మీకులగోత్ర నామముల చెల్పగోరెదను. ఇచ్చటకేమి నిమిత్తమై వచ్చితిరి?

లావ:—(సిగ్గుపడుచు కనకాంగితో) నీవే మనవృత్తాంతము యోగినికి చెప్పఁ దగును.

కన:—అమ్మా! మీరు సర్వమును స్వయముగనే యెఱుంగఁగలవారలు. అయి
నను మమ్ము కరుణించుట కిట్లడిగియుండగావచ్చును. మేము పుట్టు
కనుబట్టి బ్రాహ్మణజాతిబాలికలము. ఈమె లావణ్యలహరి యనునట్టిది.
నాకు ప్రియసఖి. ఈయమ ప్రభ్రష్టమైన తనకన్యాత్వమును పున
రుద్ధరించుటకై యీవనప్రదేశమునకు తపముసేయగా వచ్చినది. నే
నీమెకు సహాయార్థమై మైత్రిఁబురస్కరించికొని యిటకు వచ్చితిని.
ఇదియ మావృత్తాంతము.

సిద్ధ:—మీసఖీసంకల్ప ముత్తమమైనదియే. కాని పెద్దలు స్త్రీలకు తపో
విద్యాధికారములు లేవని పల్కుచుందురుగదా!

లావ:—అమ్మా! మహాత్మురాలా! అట్లైన నిఁక స్త్రీలకేమి దిక్కు? సర్వవ్యవ
హారములును పత్యధీనములైనచో నతండు సత్కర్మనిరతుఁడైయున్న
నతని ననువర్తించు ద్వారా నైహికాముష్మికముల నార్జింపగావచ్చును.
కాని ఆతండు అందులకు విపరీతుఁడైనచో నప్పుడట్టిపురుషునిఁ గట్టు
కొన్నస్త్రీకి సర్వము ననర్థమూలకమే యగునుగాదా? ఇది యుక్తమా?

సిద్ధ:—అగును. నీవన్నట్లంతయు నిక్కము. అయిన నేమిచేయగలము? స్త్రీశూ
ద్రద్విజబంధువులు వేదమును వినరాదని వేదములు వాకొనుచున్నవి.
వేదమే సమస్తైహికాముష్మికములకును ఆధారముగదా! కాని పై
జెప్పిన వాక్యమును అనువదించు మనుశ్లోకముయొక్క యర్థమదిగాదు.
ఏమందువా?

క. స్త్రీశూద్ర ద్విజబంధువు
లాశింపందగదు వేదమనెడి వచనమం
దాశూద్ర పదసుసన్నిధి
స్త్రీ శబ్దము కర్మబాహ్య స్త్రీపరముగదా!

కన:—ఇయ్యది యుక్తముగా నున్నది. విద్యాతపఃకర్మల కధికారములు స్త్రీల

కనుగ్రహించినచో స్వస్వాతంత్ర్యమునకు భంగమువాటిల్లునని కాఁ
బోలును మనలనిట్లు నిషేధించిరి.

చ. తన గృహలక్ష్మియైదనరు • దారను దాసిగఁ జేసి గోమయా
ద్యనవరతాను లేపనము • లందుఁ బ్రవృత్తలఁజేసి, యద్దియే
వనితకు మేలటంచు విధి•వాదములాడి, స్వతంత్రతక్ స్వసే
వన మొనరింపఁజేసి పయి • వ్యర్థమటంచును పల్కిరక్కటా!

సిద్ధ:—నీవుచెప్పినది నిజము. స్త్రీలకు సైతము వేదాధికారమున్నట్టులు నిద
ర్శనములు గలవు. మహాభాష్యకారుఁడగు పతంజలిమహర్షి కఠీయని
ప్రయోగించి, కఠశాఖాధ్యేత్రీ యని యర్థమును నిర్వచించిరి అద్దా
నికి వ్యాఖ్యాతయైన కైయటుఁడు స్త్రీలకు వేదాధికారమున్నదని
తాత్పర్యము బహ్వృచీయని ప్రయోగమును నుదాహరణముగా
నిచ్చినారు. స్త్రీలకు విద్యాతపోధికారములు లేనిచో నీవ్యాఖ్యాన
మెట్లు సంగతమగును?

లా:—అమ్మా! నీవు సహజముగనే సిద్ధయోగినివికదా! నీమాట లయథార్థ
ము లెట్లగును?

సిద్ధ:—కనుక నేనుచెప్పినది వేదవిహితత్వము ననుసరించిగాక లోకస్థితినను
సరించి చెప్పెడిమాట. లోకమునందు పురుషులలోనే ఎంతటివారైనను
నిశ్చలవృత్తి లభించని కారణమున విద్యాతపః ప్రభృతులు సఫలము
లగుటలేదు. ఇఁక నిట్టిస్థితిలో స్త్రీలమును తత్రాపి — అబలలమునగు
మనమీవిషయమున సమర్థలము కాగలమా?

లావ:—ఏమి యిట్టులనుచున్నారు?

సిద్ధ:—అనుటకేమున్నది. నిజస్థితిని పరికించుచో నుదాహరణమిచ్చుటనేకలదు.
విశ్వామిత్రుఁడను రాజును వినియుందురుగదా! అతండు కొండొక
కారణమున వసిష్ఠమహర్షితోఁ బోరాడి యాతని బ్రహ్మబలముచేఁ

దాను నిర్జితుండై కినిసి, యుత్తమబ్రాహ్మణ్యంబు సంపాదించెదనని ప్రాగ్దిగ్భాగమునఁ గొన్నాళ్లు తపము నాచరించినాఁడు.

లావ:—
కన:— } (ఆత్రముతో) పిమ్మట నేమి జరిగినది ?

సిద్ధ:—ఇట్లుకొన్నాళ్లైన పిమ్మట తనకు తపస్సిద్ధియైనదని తలంచి వసిష్ఠమహర్షి సమీపమున కేగి - "నేను తపంబొనరించి బ్రహ్మత్వమార్జించితిని. నన్నిటుపైని బ్రహ్మర్షి యని మీరు పిలువవలయును." అని ప్రార్థించెను.

లావ:—
కన:— } తరువాత ?

సిద్ధ:—తరువాత నతనిమాటలకు నవ్వుచు వసిష్ఠమహర్షి "అయ్యా ! మీరు చెప్పినదంతయు నిక్కమే. కాని నేను మిమ్ములను రాజర్షీ ! యని మాత్రము పిలిచెదను" అని బదులు పల్కెను.

లావ:—
కన:— } అందులకు విశ్వామిత్రుఁ డేమని పల్కెను ?

సిద్ధ:—పల్కుటకేమున్నది ? వసిష్ఠుని మాటలను వినఁగానే విశ్వామిత్రుని కసి ప్రజ్వలద్వహ్నిలో నాజ్యాహుతి వైచినట్లయినది. అంతట విశ్వామిత్రుఁడు వసిష్ఠునివంకఁ జూచి దురాగ్రహ గ్రస్తత సూచించుచు - "ఓయీ బ్రాహ్మణాభిమానీ! నన్ను బ్రహ్మర్షి యనఁజాలవుగా ! కానిమ్ము. నాతపోబలమున నిదిగో నిన్నిప్పుడే కనులతెఱిపించెద. కాచుకొనుము. నీ నూర్వురుపుత్రులును తత్క్షణమే మృతినొందఁగలరు"— అని దీర్ఘక్రోధయై శపించెను.

లావ:—
కన:— } (సభయముగా) ఓస్ ! పిమ్మట నేమైనది ?

సిద్ధ:—విశ్వామిత్రుని శాపమున నతని నూర్వురుపుత్రులు నిహతులైనారు.

లావ:—
కన:— } అయ్యో ! పాపము. వసిష్ఠుఁ డంతటనైన నతనిని బ్రహ్మర్షి యని పిలిచి తనయాపదను బాపుకొనక పోయెనా ?

సిద్ధ:—లేదు. కాని వసిష్ఠుఁడంతమాత్రానికే చలించునా! అతండు విశ్వామిత్రునింజూచి "ఓయీ! ఇంతతపస్సునార్జించియు నద్దానిని దురాగ్రహాగ్రహమునకు బలి చేసితివిగదా! ఇట్టినిన్ను 'బ్రహ్మర్షి!'—యని యేనెట్లు పిలువగానోపుదు" నని నిరాకరించెను.

లావ:—తరువాత విశ్వామిత్రుఁ డేమయ్యెను?

సిద్ధ:—ఏమగుటకేమున్నది? తనలోతాను లజ్జపడుచు నుత్తరదిగ్భాగమునకు మఱల తపముసేయుందునని వెళ్లినాఁడు.

లావ:—తల్లీ! మీమాటలను వినునప్పు డొక్కసందియము నాకు గల్గినది. దాని నడుగవచ్చునా?

సిద్ధ:—అడుగరాకేమి? నాకు తెలిసినదానిని నేను చెప్పెదను. అందులకింత సంశయమేల?

లావ:—వసిష్ఠమహర్షి బ్రహ్మకు మానసపుత్రుఁడును శమదమాదిగుణసంపన్నుఁడును నైన బ్రహ్మర్షిగదా! విశ్వామిత్రునంతటివానిని "బ్రహ్మర్షి"—యని వాఙ్మాత్రమున గౌరవించుటకింతటి యభినివేశమేల? అట్లు పిలచినమాత్రాన నతనికిఁగాఁగల హానియేమున్నది? లోకకుటుంబులకిట్టియాగ్రహ ముచితమగునా?

సిద్ధ:—స్థూలదృష్టికిది నిజమేకావచ్చును. అయినను-మహాత్ములచిత్తవృత్తులు అతిధీరములును వేదవాదనిరతములును నైయుండును. స్వోచితాచారాతిక్రమణమన్న వారికి కానిపని. కనుకనే పెద్దలిట్లందురు.

మ. ఇలలో నొక్కఁడు నెల్లవారలకుఁ దానిష్టుండు గానేర్చునే
ఖలుఁడైనన్ జనపాళిమెచ్చు విహితుల్ • గాలుష్యముల్
జెందదా, జలజంబేమి సుఖించె నల్లగలువల్ • జాడ్యంబు
బాసెన్గదా, యలదోషాకరు రాక; గాన మధుప•వ్యా
సంగ వాచాలముల్.

ఇఁక నీవసిష్ఠుండు మాత్రమేమి యలంతియా? సంగదోషము నాపాదించి యతిధృష్టతతోఁ ద్రిశంకునంతటివానిఁ గర్మబాహ్యతనొంది చండాలుఁడగునట్లు శపింపలేదా?

లావ:—అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము. తర్వాత త్రిశంకువేమైనాఁడు?

సిద్ధ:—ఆతండును గురుశాపఖిన్నుఁడై యంత్తమగతిం బడయజాలు నుపాయము నడుగుటకై విశ్వామిత్రుని యొద్దికి రానున్నాఁడు.

లావ:—అట్లయిన నీసమావేశ మతనితపశ్చర్యకు ఇంకొకవిఘ్నముగా సంభవింపదుగదా?

సిద్ధ:—అగు నదియెట్లును తప్పనిదే. 'శ్రేయాంసి బహువిఘ్నాని' - యని యిందులకే పల్కెదరు.

కన:—అయిన నవ్విశ్వామిత్రుఁ డెచ్చట తపముసేయుచున్నవాఁడో?

సిద్ధ:—ఎచ్చటనో కాదు. ఇచ్చట నీసిద్ధాశ్రమమునందే ఆకనఁబడెడి దేవదారు వాటికకు దక్షిణమున నున్న నిర్జనప్రదేశమున నిరాహారుఁడై ఘోరముగ తపమొనర్చుచున్నాఁడు.

లావ:—(ఆదరముతో) అట్లయిన నేనుగూడ నిచ్చటనే తపము సేయగోరుచున్నదాన. భగవతి! యనుగ్రహించి నాకు మంత్రోపదేశమును సేయవలయును. (అని అంజలిపట్టి ప్రార్థించుచున్నది.)

సిద్ధ:—(ఆదరణపూర్వకముగా) వత్సా! అట్లే కానిమ్ము. రమ్ము. (అనిచెవిలో మంత్రోపదేశమును సేయుచున్నది.)

లావ:—కృతార్థురాలను. కృతార్థురాలను. పరమేశ్వరుని దయవలనను ఈ సిద్ధక్షేత్ర మహిమవలనను నీకృపచే లభించిన యిమ్మంత్రరాజమున విశ్వామిత్రునికి బ్రాహ్మణ్యసిద్ధియగునట్టులు నాకును కన్యకాత్వము సిద్ధించునట్టులు ఆశీర్వదింప వేడెదను.

సిద్ధ:—తథాస్తు. (అని వెడలిపోవుచున్నది.)

లావ:—అమ్మా! సర్వథా శిష్యురాలిపై దయయుంచుడు. (అని వెంట సఖీసమేతముగా జనుచున్నయది.) (అందఱును నిష్క్రమింతురు.)

(ఇది విష్కంభము.)

---

(భస్మ రుద్రాక్షమాలికా ధరుఁడై తపోనిష్ఠతో
విశ్వామిత్రుఁడు ప్రవేశించును.)

విశ్వా:—(స్వగ) అయ్యయో! చిరప్రార్థితములగు నర్థములు సిద్ధింపనున్నయదనులో నెంతెంత మహావిఘ్నములు సంభవించుచున్నయవి! నేను వసిష్ఠునియెడగల పట్టుదలతో ననన్యదుర్లభమగు బ్రాహ్మణ్యమును సంపాదింపఁదలంచి తపమొనర్చుచు—కాముకత్వము శ్రేయఃప్రాప్తిని అడ్డగించునని యెఱింగియుం, నక్కన్యకామణికి వశుఁడనైనందునగదా ఇట్టులు నాకీవిఘ్నము ప్రాప్తించినది. ఎంతజేలనైతిని. (కొండొకతడవు చింతించి) కానిమ్ము. మఱల దీక్షించెదను. ఇఁకనీమాఱుమాత్రము—

చ. జలనిధులింకనిమ్ము ధర♦సర్వము క్రుంగినఁ గ్రుంగనిమ్ము స
త్కులగిరు లెల్లగాలినను♦గూలగనిమ్ము రవీందుబింబ మం
డలము తటాలునన్ దెగిప♦డన్ బడనిమ్ము మనమ్ము నిష్ఠ ని
శ్చలముగ నుంచితిన్ దపము♦సల్పి దృఢంబు ద్విజర్షి నయ్యెదన్.

(అని స్వస్తికాసనమునఁ గూర్చుండి ససంశయముగ) మఱల నెవ్వరైన నొరులు తపోవిఘ్నము నాచరించినచో నేమిచేయవచ్చును? (కొంచెమాలించి, గంభీరముగా) కానిమ్ము. అదియుఁ జూచెదఁగాక. (ఆలోచించి) యజ్ఞదత్తుడెందుల నుండెనో కానరాకున్నాఁడు. పిలచి చూచెదను. వత్సా! యజ్ఞదత్తా!

యజ్ఞద:—(ససంభ్రమముగఁ బ్రవేశించి) (స్వగ) ఓహోహో! విశ్వామిత్రమహర్షి ఇచ్చటనే యుండెనా? మఱల తపఃప్రయత్నముఁ జేయుచున్నాఁడు కాఁబోలును. (ప్రకా) అయ్యా! ఇదిగో వచ్చినాఁడను.

విశ్వా:—ఏమోయీ! ఇంతకాల మెచ్చటికేగితివి?

యజ్ఞ:—దేవరకై వనమంతయు వెతకి వేసారి వచ్చుచున్నాఁడను.

విశ్వా:—సరియే. అయినదేదో యైనది.

యజ్ఞ:—(స్మితముఖుఁడై యుండును.)

విశ్వా:—(స్వగ) ఒకవేళ నితఁడు నారహస్యము నెఱింగియుండునా? రహస్యజ్ఞులగు వారికించుక నగవును నిర్భీతియును సాహసికత్వము నుండును గదా! (ప్రకా) యజ్ఞదత్తా! నీవు ఆశ్రమద్వారమున జాగరూకతతో నుండవలయును. ఒరులెవ్వరైన వచ్చినచో నాకుతెల్పనిది ప్రవేశము నొసంగవలదు.

యజ్ఞ:—చిత్తము. అట్లే గురువుల యానతిని శిరసా వహించెదను.

(తెరలో కలకలధ్వని-అనంతరమిట్లు వినఁబడును.)

చ. కులగిరులెల్లఁ బెల్లడిలి • కూలఁదొడంగె రసాతలంబునన్
మెలఁగెడు శేషుశీర్షములు • విక్కిలి క్రుంగె ధరాభరంబుచే
జలనిధులింకెఁ బైని రవి • చంద్రులు గాంతి విహీనులైరి య
స్ఖలిత తపంబుజేయ సమ • కట్టెను నెవ్వఁడో ధారుణీస్థలిన్.

(పిదప నారదుఁడును బ్రహ్మయుఁ బ్రవేశింతురు)

బ్రహ్మ:—(చ. కులగిరులెల్ల అను పద్యమును చదివి) నారదా! ఇట్టి కల్లోలమునకుఁ గారణమెవ్వఁడై యుండునో కదా?

నార:—మఱి యితరుఁడెవ్వఁడు అగును! సిద్ధాశ్రమ తపస్వి విశ్వామిత్రుఁడు తప్ప.

బ్రహ్మ:—ఓహో! విశ్వామిత్రుఁడే యగునా! (ఆలోచించి) అట్లయిన మేనక యేమైనది?

నార:—మేనకకు రొట్టెవిరిగి నేతిలోబడినది. కుమారికను గనుటతో ఆమె పని యైనది.

బ్రహ్మ:—అట్లయిన విశ్వామిత్రుని తపనియమ్మైనె యుండవలసినదే కదా! మఱల దపఃప్రవృత్తి యెట్లు సంభవించినది?

నార:—ఎట్లా? ఆకాశవాణి కృపచేత!

బ్రహ్మ:—అదియేమి?

నార:—విశ్వామిత్రుఁడు మేనకనిజస్థితినెఱింగి యామెను శిలగా శపించి మఱలఁ దపఃప్రవృత్తుఁ డైనాఁడు.

బ్రహ్మ:—అటులైనచో మనమిఁకఁ దామసింపదగదు. సత్వరముగా నటఁ జేరి యామహర్షి కోరిన వరముల నొసంగి యతనిని మఱలింపవలయును రమ్ము.

నార:—దేవర తలంచినచో నన్యథాయగునదేమున్నది? ఇదిగో సిద్ధముగా నున్నాఁడను.

[బ్రహ్మయును నారదుఁడును ఆకాశావతరణము నభినయించి విశ్వామిత్రునిఁ జేరఁగా వచ్చుచున్నారు.]

బ్రహ్మ:—అదిగో! చూడుఁడు. ఆమహర్షి ఎట్టిదీక్షతో తపము సేయుచున్నాఁడో! మనము నతనిచెంతఁ జేరి ప్రశ్నింతము. (అని సమీపించి పరికించుచున్నాఁడు.)

నార:—ఎంతనిశ్చంచలముగాఁ దపముసల్పుచున్నాఁడో చూడుఁడు.

బ్రహ్మ:—(కమండలూదకములతోఁ బ్రోక్షించును.)

విశ్వా:—(కదలక మెదలక యుండును.)

బ్రహ్మ:—వత్సా! విశ్వామిత్రా! ఏలయింతటి ఘోరతపమునకై మఱల సంకల్పించితివి. నీకోరునట్టిదెద్ది?

విశ్వా:—(వినియును విననట్టులుండును.)

బ్రహ్మ:—
నార:— } ఓమహానుభావా! విశ్వామిత్ర మహర్షీ! నీకు కావలయునదెద్ది? స్వర్గసుఖమా? లేక వైకుంఠమా? లేక మఱెద్దియైనగలదా? నీయభీప్సితమును మాకెఱింగించి మమ్మనుగ్రహింపుము.

విశ్వా:—(మెల్లమెల్లనఁ గన్నవఁదెఱచుచు సంభ్రమము నటించి) అయ్యా! తామెవ్వరోకదా! దయతో నెఱింగించి ధన్యునింజేయుండు.

నార:—అయ్యా! నీయెఱుఁగనిదికలదా! ఈయన సకలచరాచర ప్రపంచ కర్తయగు బ్రహ్మగారు. నేనతని పుత్రుఁడను. నారదుఁడని నన్నం దురు.

విశ్వా:—సకలప్రపంచకర్తలగు విధాతలు తామేనా? తమదర్శనమున నేఁడు కృతకృత్యతఁ జెందితిని. (సోద్వేగముగా) కాని అయ్యా! తాము సర్వసములై నిరపేక్షముగ సృజించువారగుటచేత నొకవిషయమును తమనడుగవలసియున్నది.

బ్రహ్మ:—సందియమేల? అడుగఁదలంచినవాని నన్నిఁటిని అడుగగావచ్చును.

విశ్వా:—సమదర్శనులై జగములన్నింటిని సమముగా సృష్టించి మనుపవలసిన వారగు తాము ఇంతటి పక్షపాతముతో జగత్సృష్టిని సాగించుచు న్నారేల? దీనం దమకుఁ గాఁగలది యేమున్నయది?

బ్రహ్మ:—నిజము! ఈసృష్టినిర్మాణమున మాకుఁగాఁ గలదెద్దియును లేదు. కాని మేము నీకార్యమున పరతంత్రులమై పరమేశ్వరుని యాజ్ఞకు బద్ధులమై సృష్టిక్రమమును సాగించుచున్నాము. ఇట్టిస్థితిలో మాచే సిన పక్షపాతమేదియో తెలుపఁగోరుచున్నాను.

విశ్వా:—పక్షపాతమునకు నిదర్శనములు వలయునా? అనంతముగా నున్నవి. అయినను దానిని వెదకుటకై ఎంతదూరమో యన్వేషింపనక్కఱ లేదు. నిదర్శనముగా ప్రకృతమునఁ బ్రత్యక్షముగా మేమే కన్పడు చుండుటలేదా? సాంద్రతపోనిష్ఠాగరిష్ఠుఁడనగు క్షత్త్రియునిగాను అవ్వసిష్ఠుని బ్రహ్మర్షినిగాను చేసితిరికదా! ఇది చాలదా తమ పక్ష పాతవృత్తి కుదాహరణము?

బ్రహ్మ:—(నవ్వుచుఁ బ్రక్కనున్న నారదునివైపు చూచి) చూచితివా నారదా! ఈమహర్షి మానస మిప్పటికిని రాజసప్రకృతి నుల్లంఘింప

జాలకున్నది. ఎంతదీర్ఘముగ తపస్సొనర్చినను అయ్యది దుస్త్యజమే యైనదికదా!

నార:—(ఇంచుకనవ్వుచు సహేలముగా) అగును. రాజసతమః పరీతులకు సత్త్వగుణములు అలవడనేర్చునా? అట్లైనఁ దమసృష్టికి వైపరీత్యమే కల్గునుగదా.

బ్రహ్మ:—(విశ్వామిత్రునితో) మహర్షివర్యా! ఏల యీవృథాక్రోశములు తపస్విజనులకు. అందునను మీనుబోంటి సాత్త్వికుల కిట్టివి తగనివి కాదా? కావున నాసృష్టికార్యమునఁ బక్షపాతముగలదనుమాట కేవలమవిచారితము. ఈశ్వరాధీనులమై ఆయాప్రాణిజాలముల కర్మల కనుగుణముగా మేమీ సృష్టిక్రమమును నడుపుచుమన్నమాట తమరు ఎఱుంగనిది కాదు గదా? ఇట్టిస్థితిలో నాచేసిన పక్షపాతమెట్టిదయ్యా!

విశ్వా:—(స్వగ) ఎంతజడబుద్ధి! (ప్రకా) అయ్యా! ఇంకను దమమనస్సున కీవిషయము అవగతముకాలేదా? అట్లయిన నిదిగో మనవిచేయుచున్నాను. తమచేసిన పక్షపాతముల వివరించుట కియ్యది నాందీపాతము, చిత్తగింపుడు.

చ. ధని ననపత్యుఁగా నటులె • దాతను నిర్ధనుఁగాఁ బరస్పరం
బననుగుణంబు దంపతుల • కౌఱయ సంఘటనంబు బాల్యమం
దున విధవాత్వమొందినవ•ధూమణికిన్ మఱి పెండ్లిమానుటల్, మనుజులహెచ్చు తక్కువలు • మాయురె కావె కో
పక్షపాతముల్!

బ్రహ్మ:—(సోపహాసముగా) ఇందు నన్ను నిందించుట కెట్టిన్యాయము కల [దయ్యా?

క. కనకము మంచిది గాదని
తనుఁదెలియక శిల్పి వన్నె • తక్కువగా భూ
షణ మొనరించెడు ననుక్రియ
ననుదిట్టుట కర్మవాస•నావశతఁ గదా!

విశ్వా:— (కోపముతో) అట్లయినచోఁ దామునాకేల వరముల నొసంగఁ దలంపవలయును? నాకర్మవాసన మెట్టులున్న నట్టులుకాఁగలదు. ఇఁక తాము యథేష్టముగా నరుగవచ్చును.

బ్రహ్మ:—నాయనా! విశ్వామిత్రా! నీవెఱుంగని దేమున్నదయ్యా!

విశ్వా:—అగును! ఎఱుంగుదును. ఎఱిఁగి చేయఁదగినదేమున్నది?

బ్రహ్మ:—ఇంకను నేమిచేయవలయును? ఇప్పటికే మీరుచేసిన దుష్కరమగు తపస్సువలస లోకములన్నియును తల్లడపడుచున్నవి. లోకబాధను ఎట్టిదుష్కరములగు వరములనైనను ఒసంగి మాన్పవలసియుండుట మాకువిధి కావుననే మేము నిన్ను ఈతపఃప్రవృత్తినుండి మాని అభీష్టవరములను కోరుఁడని యర్థింపవలసి వచ్చుచున్నది. మానుము వత్సా మానుము. నీయభీష్టమును ఎఱింగింపుము.

విశ్వా:—నాకేమి యభీష్టములున్నవి? ఉన్నను మీకుతెలియనివి కలవా?

బ్రహ్మ:—అభీష్టములు లేకేమి? బ్రహ్మర్షిత్వమందవలెనని కదా యీమీయత్నము?

విశ్వా:—నాయత్నమును తామెఱింగియున్నచో మఱల నీప్రశ్న లేల?

బ్రహ్మ:—వత్సా! - ఇటుపైని నిన్ను బ్రహ్మర్షియని మేమే స్వయముగా వ్యవహరించుచునుందుము. నీకు సందియమేల?

విశ్వా:—(అర్ధాంగీకారముతో) తాము ప్రయోజనాపేక్షులై పిలచెదరే యనుకొందము. అయిన నంతమాత్రమున నాకేమి లాభము? నాకు వసిష్ఠునితోఁడఁగదా వివాదము సంఘటిల్లినది? ఆతండు నన్ను బ్రహ్మర్షీయని పిలచినంగాని నేనీతపమును మానజాలను. "ఇంతిస్వార్థపరత యేల?" యని యందురేమో బ్రహ్మాదిస్తంబపర్యంతము ఇదియేకదా నిండియున్నయది.

నార:—(విశ్వామిత్రునితో) అయ్యా ఆట్లేకానిమ్ము! (బ్రహ్మతో) తండ్రీ! మన మవ్వసిష్ఠునే యనునయించినఁ గార్యసిద్ధి సుకరముగా తోఁచుచున్నది. కావున నచ్చటికే పోయి యతనినర్థించి వత్తము రండు.

బ్రహ్మ:—అట్లేని పద పోదము. (అని యుభయులును నిష్క్రమింపనున్నారు.)

[తెఱలో:—మా ప్రియమిత్రుఁడగు విశ్వామిత్రుఁడెచ్చటనున్నవాఁడు?

బ్రహ్మ:—(సంభ్రమముతోఁ జూచి) ఇదె యీవచ్చునాతఁడు వసిష్ఠశాపమునఁ జండాలతనొందిన త్రిశంకువు కాఁబోలును. మఱల నీ విశ్వామిత్రునికేదేని విఘ్నము పొసఁగునట్లున్నది.

నార:—అయినఁ గావచ్చును. మనమొక ప్రక్కకు నోసరిల్లి పరికింతము రండు. (అని నిష్క్రమించెదరు.)

త్రిశం:—(భార్యతో ప్రవేశించి) అయ్యా! మా ప్రియమిత్రుఁడగు విశ్వామిత్రుఁ డెచ్చట నున్నవాఁడు?

యజ్ఞ:—(ప్రవేశము నభినయించి) ఇచ్చటనే యున్నవాఁడు. ఇదియ వారి యాశ్రమము. తామెవ్వరు?

త్రిశం:—నేను త్రిశంకువును. నామిత్రునిఁ జూడవలయును.

యజ్ఞ:—అటులేని కొంచెమునే పిచ్చటఁ గూర్చుండుడు. వారితో నీవృత్తాంతము నెఱింగించి వచ్చెదను. (అని నిష్క్రమించి - విశ్వామిత్రుని సమీపించి) మహాత్మా! గురువరా! మీచిరమిత్రమగు త్రిశంకువు వచ్చి దర్శనమునకై ఆశ్రమద్వారమున నిలచి యున్నాఁడు.

విశ్వా:—(తపము సాలించి సంభ్రమముతో) నామిత్రుఁడగు త్రిశంకువేనా? అట్లయినఁ దామసింపక యతనిఁ బ్రవేశపెట్టుము.

యజ్ఞ:—చిత్తము. (అని నిష్క్రమించెను.)

విశ్వా:—(స్వగ) మిత్రము రాకకుఁ గారణమేదియై యుండవచ్చును? నాతపస్సిద్ధి నఱయుటకా! లేక వసిష్ఠుని కోపబాధలకు తాళఁజాలకయా? ఏదైన నొకటియుండును.

త్రిశం:—(భార్యతో) ప్రాణసఖి! తపస్వులు వినయమున సమీపింపఁదగినట్టివారు.

త్రి-భార్య:—మీయాజ్ఞానుసారము వర్తించెదను.

త్రిశం:—(నిర్వేదముతో) ఆహా! మహాత్ముఁడు. పోల్చికొనుటకైన వీలుకలుగనట్టులుగా శరీరకార్శ్యము నొందినాఁడు. ఎట్లైననేమి సిద్ధసంకల్పుఁడు. ఇంతటి మిత్రముగల నాకిఁక యూర్ధ్వగతి యేల లభింపకుండును. (ప్రకా) ఓయీ విదూషకా! రమ్ము.

(అనుచు విశ్వామిత్రుని సమీపించును.)

విశ్వా:—(స్వగ) ఇదియేమిది? ఈ యస్థిమాలలు-ఈ నీలాంబరధారణము - ఈ రూపరేఖావిలాసములు-ఇవియన్నియును చండాలతను సూచించుచున్నవి. ఈతండెవ్వండైౖ యుండును. ప్రియమిత్రుని ప్రవేశపెట్టుమనిన యజ్ఞదత్తుఁ డితనినేల ప్రవేశపెట్టెను? దైవము చండాలప్రవేశముంజేసి మఱల తపోవిఘ్నమునకు సంకల్పించలేదుగదా! (ప్రకా) ఓయీనీవెవ్వరవు? దూరమున నుండుము. (యజ్ఞదత్తునితోఁ గోపదృష్టిని) వత్సా! ఎఱిఁగి యెఱింగి చండాలు నేల యిచ్చటికిఁ బ్రవేశపెట్టితివి? వేగముగా నిరోధించి పంపివేయుము.

యజ్ఞ:—(భయపడుచు) చిత్తము చిత్తము. అట్లేచేసెదను. (త్రిశంకువుతో) పో పొమ్ము. ఇచ్చటికి రాఁగూడదు.

త్రిశం:—(భయకంపములతో) అయ్యో! మహానుభావా! విశ్వామిత్రమహర్షీ! నాదౌర్భాగ్యవశమున నన్నే పోల్చుకొనలేవైతివి గదా! అయ్యో దురదృష్టమహిమము!

చ. ఇనకులమందుఁ బుట్టితి జయించితి శత్రుగణంబు నేలితిఁ
తనుజులమాడ్కి లోకులను తథ్యముఁ దప్పక యుంటి నెప్డు
జేసిన దురితం బదేమొకొ వసిష్ఠుఁడు నన్ను శపించినందుచేఁ
దను విటులయ్యె స్వర్గతినిఁదార్కొన జేయుము వేగమిత్రమా.

విశ్వా:—(విననట్టులభినయించి) మహర్షుల పుణ్యాశ్రమవాటికలు చండాలురకప్రవేశ్యములు. తొలఁగిపొమ్ము.

త్రిశం:—(భయకంపములను మిక్కుటముగా నభినయించుచు నశ్రువులొలుక) మహానుభావా! నన్ను నిక్కముగా చండాలుఁడనియే తలంచితిరా! నేను నిజమునకుఁ జండాలుఁడను గాను. నీప్రియమిత్రుఁడను త్రిశంకువును. (అని - ఇనకులమందు - అన్న వెనుకటి పద్యమును చదువుచున్నాఁడు.)

విశ్వా:—(సావకాశతతో ఆలకించి) (స్వగ) నిజముగా నాప్రియమిత్రుఁడగు త్రిశంకువే కాఁబోలును. అయిన నిదియేమి? చెప్పెను గురుశాపమని. పాపము శప్తుఁడైతినను ఖేదమున శరణార్థియై వచ్చినటులున్నది. కానిమ్ము. రక్షించి కనుగొందును. (ప్రకా) యజ్ఞదత్తా! సత్వరమతనిఁ బ్రవేశపెట్టుము.

యజ్ఞ:—చిత్తము (త్రిశంకువుతో) అయ్యా! గురువుల యనుజ్ఞయైనది. ఇఁకఁ దామురావచ్చును. మాగురువులు తమరాకకై నిరీక్షించి యున్నారు.

త్రిశం:—(ప్రయాసహితముగ విదూషకునితోఁ గూడి ప్రవేశించును.)

విదూ:—(విశ్వామిత్రునితో) అయ్యా! మారాజు గురుశాపభిన్నుఁడై మిమ్ము శరణము వేఁడ వచ్చినాఁడు.

త్రిశం —శరణము శరణ్య శరణము. (అని సాష్టాంగముగ విశ్వామిత్రుని పాదములమ్రోల వ్రాలుచున్నాఁడు.)

విశ్వా:—(త్రిశంకుని లేవదీసి సాక్రోశముతో) అహో! వసిష్ఠుని దుండగము. ఉత్తమక్షత్రియుని - అందునను విశుద్ధుని - తత్రాపి ప్రమాదముపాలయినవానిని - చండాలుఁడగునట్లులు శపించినాఁడు గదా. కానిమ్ము నేనితనిని యుద్ధరించి వసిష్ఠునికి బుద్ధివచ్చునట్లు చేసెదను.

(త్రిశంకువుతో)

ఉ. నీవు భయంబు మాను మిట • నీతిదొలంగక యున్న నిన్ను
నే, పావనమైన జన్నమిటఁ • బాగుగ జేసి సమస్తపుణ్యాసం

భావితుఁ జేసి స్వర్గతికిఁ • బాత్రునిజేయుదు నింక మెచ్చఁ
గా, దేవతలెల్లఁ జేసెద న•దీనత నుండగదయ్య మిత్రమా!

భయపడకుము. దుర్లభంబైన సశరీరస్వర్గతి నే నీకొసంగెదను.

త్రిశం:—పరమమిత్రులగు మీరుండగా నాకిఁక భయమేల?

విశ్వా:—(ధ్యాననిమీలితాక్షుఁడై, ఆలోచించి) కానిమ్ము. ఇతనిచేతనే యజ్ఞమునొకదానిని చేయించెదను. (సంకల్పపూర్వకముగా) యజ్ఞసంభారములును ఋత్విక్కులును సంసిద్ధముగా నుండునుగాక.

యజ్ఞ:—(సహర్షముతో) మహాత్మా! యీసంకల్ప మమోఘమైనది. యజ్ఞసంభారము లుత్పన్నములైనవి. ఋత్విక్కులును వచ్చియున్నారు కాని...

విశ్వా:—కాని యేమి? కొఱవ యేదైన నున్నదా?

యజ్ఞ:—లేదు. కాని వచ్చిన ఋత్విజులలో దాల్భ్యాయనుఁడు వరణార్హుఁడుగా లేఁడు.

విశ్వా:—ఏల?

త్రిశం:—ఆతని సోదరి అవివాహితగానుండి ఋతుమతి యైనది. అద్దాన నతని దోషజుష్టుఁ డనుచున్నారు.

విశ్వా:—ఈవిషయమును నీ వెట్లు లెఱింగితివి?

త్రిశం:—మిత్రమా! స్మృతికిఁ దెచ్చుకొనుము. తొల్లి మనము వేఁటకుఁ బోయినపుడు మహాటవిని విశ్రాంతులమై యుండగా నామె మనచెంతకు వచ్చియున్నది. ఆమెయె ఇప్పుడీ తపోవనమునందు తపశ్చర్య చేయుచున్నయది.

విశ్వా:—తపస్సిద్ధురాలగు నామెసంబంధమున నతఁడును మఱింత పవిత్రుఁడే యగును. పెద్దలన్నారుకదా! – ద్విధా హి స్త్రియః బ్రహ్మవాదిన్య

స్సద్యో వథ్వ శ్చేతి - అని. కావున నామె నిందార్హురాలు కాదు.

యజ్ఞ:—ఆమె యదిగో! అనతిదూరముననే యున్నది.

విశ్వా:—యజ్ఞదత్తా! మనమిఁకఁ గ్రతువు నారంభింతము. అగ్నులను బ్రేల్చి సమంత్రకముగ హవిస్సులకై ఇంద్రాదులను బిల్వుము. ఈ త్రిశంకుఁడే మనము చేయుచున్న ఈ యజ్ఞమునకుఁ గర్త. నేను యాజకుఁడనుగా నున్నాను.

యజ్ఞ:—చిత్తము. (అని వెడలి పోయి, మఱల ప్రవేశించి-స్వగ) ఎంతగ పిలచినను ఇంద్రాదులు రాకున్నారు. (ప్రకా) అయ్యో! తమయాజ్ఞ నతిఁ జేసితిని. కాని ఎంతగ నాహ్వానించినను ఇంద్రాదులు రాకున్నారు.

విశ్వా:—కారణమేమి?

యజ్ఞ:—అది దేవరకే తెలియఁ దగినది.

విశ్వా:—(ధ్యానస్థితిని పరికించి) (స్వగ) ఆఁ దుష్టులైనారు. (ప్రకా) కానిమ్ము మించిన దేదియు లేదు. ఇదిగో సిద్ధముగా నుంటిని వింటివా?

చ. విధికి విధిన్ హరీశులకు ♦ వేఱ హరీశుల సూర్యచంద్రులన్
బుధులకు వేఱుగా బుధుల♦ పూర్వులుగా నొనరించి స్వర్గమి
వ్విధమున నందునింద్రుని నవీనుని మిత్రుని జేసెదన్ మనో
వ్యథ జెలఁగంగ దేవతల ♦ కద్భుతముల్ గలిగింపఁ జేసెదన్.

[అని కమండలోదకముల జేకొని సంకల్పింపఁగా బోవుచున్నాఁడు.]

[తెఱలో:—ఉ. మానుము మానుమయ్య యభి ♦ మానము
సృష్టివిధానముల్ మహా, జ్ఞానికి యుక్తమయ్య
యిటు ♦ జాలుఁ దపంబు జపంబు లోకసం, స్థాన
ము భ్రష్టమయ్యెను పదంబుల మ్రొక్కెదమయ్య
లోకస, మ్మానితమౌని! నీదు మహిమంబు బస
మానము గాదె కౌశికా!

విశ్వా:—(విననట్టు లభినయించి) మిత్రమా త్రిశంకూ! నాచేసిన దుష్కరమగు తపమునిదె నీకొఱకై అర్పణచేయుచున్నాను. నీవిఁక నిర్భయుండవై త్రిదివమును సశరీరముతో నధిష్ఠింపుము. పొమ్ము. (అని సంకల్పోదకమును వదలుచున్నాఁడు.)

త్రిశం:—(మహానందముతో) చిత్తము. తమదయవలనఁ గృతార్థతఁ గంటిని. (అని ఆకాశాధిరోహణము జేయుచు-నంతలో) అయ్యా! చచ్చితిని. చచ్చితిని. రక్షింపుఁడు. రక్షింపుఁడు. నన్నీ దేవతలు తిరుగఁ గ్రిందికి బడవైచుచున్నారు. (అని పెద్దగా నఱచును.)

విశ్వా:—(తలయెత్తి - ఆకాశమువైపు చూచి) ఏమేమీ? ఇంద్రాధముఁడు మన్మిత్రుని కాలదన్ని తిరుగ నేలఁ బడఁద్రోసినాడుగా? (నిశ్చలదృష్టితో) మిత్రమా! భయపడకుము. ఇప్పుడు నీవున్నచోటుననే నీకు వేఱొక స్వర్గమును నిర్మించుచున్నాను. (అని సంకల్పించుచుండును.)

(ఇంద్రాదులు ససంభ్రమముతోఁ బ్రవేశింతురు.)

ఇంద్రు:—గురువరా! త్వరపడవలయును. మనము విశ్వామిత్రమహర్షిని సమీపించులోపలనే రెండవస్వర్గమునకైన సంకల్పము ముగియుంనేమో కదా! వేగముగ నతనిఁ జేరుదము.

బృహ:—అటులనే కానిమ్ము. (అని ఆకాశావరోహణము నటించును.)

ఇంద్రు:—(అవరోహణము నటించి) గురువరా! వీరెవ్వరో ఉభయహస్తముల నుభయపక్షములవారిని బ్రతిమాలుచున్నారు.

బృహ:—వారిరువురును బ్రహ్మయును నారదుఁడును. వారికి మధ్యభాగమున గమండలుపాణియై దండము ద్రిప్పువాడె వసిష్ఠుఁడు సుమా!

(పిదపఁ బైనిచెప్పిన యాకృతులతో వసిష్ఠాదులు ప్రవేశింతురు.)

బ్రహ్మ:—అయ్యా! వసిష్ఠా! మహర్షిశ్రేష్ఠా! యీసంకటమును జూచితివి

గదా! మా యీ బాధల నుపశమింపజేయుటకై నీవిపుడీ విశ్వామిత్రుని బ్రహ్మర్షీ యనవలయును. మమ్ము సర్వదా నీయుపద్రవమునుండి కాపాడవలయును.

వార:—(వసిష్ఠునితో) మహాత్మా! మీరు లోకోపకారులు. కావున లోకక్షేమార్థ మిద్దానిని జేయుండు.

ఇంద్రాదు లందఱు:— } అయ్యా! దయతో నిట్టులు జేయుండు. (అని యందఱు బ్రతిమాలుదురు.)

బ్రహ్మ:—అయ్యా! విశ్వామిత్రా! మీరింతటనైన తపము సాలింపుడు. మీ కోరినయట్లు వసిష్ఠునిచే మిమ్ము బ్రహ్మర్షి యని పిలిపించనున్నవారము.

విశ్వా:—చిత్తము. నాకింతకంటెను కావలసిన దేమున్నది?

ఇంద్రు:—(విశ్వామిత్రునితో) మహాత్మా! సుప్రసన్నతజూపి యనుగ్రహించితివి. ఇదె మీపాదములకు మ్రొక్కుచునున్నవారము. నీసృజించిన రెండవస్వర్గమును ఆగ్నేయదిగ్భాగమున నుంచుఁడు. మేనకను ఇంతటనైనను శాపవిముక్తఁ జేయుండు.

(అని వేడుకొనుచున్నాఁడు.)

విశ్వా:—అట్లే (యని ధ్యాననిమీలితాక్షుఁడై) మేనకా! ఎప్పటియట్లుండువు గాక.

మేన:—(యథారూపమున వచ్చి నమస్కరించుచున్నది.)

ఇంద్రాదులందఱు నొక్కటిగా:—(వసిష్ఠునిపాదములఁబడి) గురువరా! వసిష్ఠమహర్షీ! విశ్వామిత్రుని బ్రహ్మర్షీయని పిలచి మాప్రాణముల నుద్ధరింపుము. (అని కాళ్లపైఁ బడుచున్నారు.)

వసి:—(అందఱను లేవనెత్తి) విశ్వామిత్రమహర్షీ! నేను పిలచుట కేమున్నది? నా పిలుచుటకు ముందే నీవు బ్రహ్మర్షివైతివి. కావున నో బ్రహ్మర్షీ! ఇఁక నింతట లోకకల్యాణమునకై నీవు దీర్ఘక్రోధమును త్యజించి తపము సాలింపుము.

విశ్వా:—(హర్షములో) ధన్యుండనైతిని. నాపంతము తీరినది.

త్రిశం:— మేనకా! పిల్లనువిడిచి యొంటిగనేల వచ్చితివి?

మేనక:— అయ్యా! మాపిల్ల కణ్వాశ్రమమున నున్నది. తమయాజ్ఞయైనచో తోడ్కొనివచ్చెదను.

విశ్వా:—(స్వ) అయినదేదో అయినది. మఱి యింకను నాకీ సంబంధమేల? (ప్రకా) వలదు. దానిని అక్కడనే యుంచదగును. కణ్వుని ఆశీః ప్రభావమునను దేవతల కృపవలనను నామె చిరంజీవిని యగుగాత మీరందఱును నిట్లు ఆశీర్వదింపుడు.

అందఱు:— తథాస్తు. తథాస్తు. తథాస్తు.

లావ:—(ప్రవేశించి) ఇందఱు మహాత్ములు చేరిన యీ సమావేశము నాకు పునఃకన్యకాత్వము ననుగ్రహించుఁ గాక.

అందఱు:— తథాస్తు. తథాస్తు. తథాస్తు.

విదూ:— సకాలమునకు చిరకాలమునుండి భోజనము లభింపనికతన నేనే స్వయముగా పాకముచేసికొని భుజింపఁగోరుచున్నాను. కావున నాకు పాకసిద్ధిగల యుంవతీత్వమును మీరందఱు ననుగ్రహించెదరు గాక.

అందఱును (పకాలున నవ్వుచు) తథాస్తు. తథాస్తు. తథాస్తు.

బ్రహ్మాదులందఱు (నొక్కటిగా) } బ్రహ్మర్షీ! బ్రహ్మర్షీ! విశ్వామిత్రా! ధన్యుఁడవైతివి.

విశ్వా:—(దిగ్గునలేచి) ధన్యుఁడనైతిని. మీదర్శనమున సుఖించితి. (అని ప్రణమిల్లుచున్నాఁడు.)

వసి:— అయ్యా! మేనకయును శాపవిముక్తయై ధన్యతం గన్నది. ఈమె కుమారిత శకుంతల గణ్వునిచే పోషింపఁబడుచున్నది. యింద్రునకు నిశ్శంకమగు నింద్రపదవి స్థిరపడినది. నీవు సృష్టించిన స్వర్గమును నిర్బాధకముగా నున్నది. నీమిత్రుఁడు త్రిశంకు వూర్ధ్వగతి నొంది

నాఁడు. సర్వమును సంపన్నమైనది. నీవు బ్రహ్మర్షి వైతివి. ఇఁక నింతకంటెఁ దమకు ఏమి కావలసియున్నది? అయిన నీభరతవాక్య మగుఁగాక.

అందఱుకలసి పఠింతురు:—

ఉ. నీతి దొలంగకుండ నవ•నీపతు లేలుత నిర్గరణ బ్రణ
వ్రాతము పుత్రపౌత్ర తతి • వర్ధిలుగాత సువృష్టిచేత జీ
మూతము సస్యసంపదలఁ • బ్రోచును గాత దయాప్రపూ
ర్ణుఁడై, సీత మనోవిభుండు మిము • క్షేమముఁదాల్ప నను
గ్రహించుతన్.

(తెర వ్రాలుచున్నది. అందఱును నిష్క్రమింతురు.)

గద్య. ఇది శ్రీమత్త్రిభువన పవిత్ర గౌతమసగోత్ర వతంస పేరి
వంశస్థూలముక్తాఫల శ్రీమన్మహోపాధ్యాయ వేంకట
శాస్త్రిపుత్ర మహాలక్ష్మీగర్భపారావారకళానిధి
శ్రీ కాశీనాథ విద్వత్కవిప్రణీత
పూర్వశాకుంతలనాటకమున
షష్ఠాంకము.

పూర్వశాకుంతలనాటకము సమాప్తము.

---

15-వ పేజీ 6-వ పంక్తిలో 'యెవ్వత వెండవేడిమిఁ' అనునది 'యెవ్వత లెండవేడిమిఁ' అని పఠించునది.

# ఆంధ్ర గ్రంథములు.

---

ప్రతి 1-కి రూ. అ.

అచ్చ తెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... 1 4

    డిటో కాలికోబైండు ... 1 10

అడవిమల్లెలు ... 0 8

అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు ... 1 8

అనంతునిఛందము, ఛందోదర్పణము ... 0 14

అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... 0 8

    డిటో కాలికోబైండు ... 0 14

అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతోనున్నది 2 8

అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) ... 0 4

ఆముక్తమాల్యద, వా. శ్రీ. రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో
    మేలు కాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము 3 8

ఆంజనేయదండకము, హనుమద్దండకము ... 0 2

ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రిత
    మైనప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... 6 0

    డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు ... 8 0

    డిటో 3 సంపుటములు ... 10 0

శ్రీమదాంధ్రభారతము–పద్యకావ్యము:—

    అనేక వ్రాతప్రతులసహాయమున చిరకాలమునుండి సంపూర్ణ
    పరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది, మేలుకాగితములపై
    స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయఁబడి
    యున్నది. 7 సంపుటముల ప్రతి ... 15 12

        3 సంపుటముల ప్రతి ... 15 0

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆదిపర్వము, మాత్రము పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | .. | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యతీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 7 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము చక్కనికూర్పు | | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 10 |
| గోపీనాదరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజుకాగితములది | ... | 1 | 10 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 4 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కనిప్రతి | | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| డిటో కాలి[illegible] ... | 1 | 6 |
| పంచత[illegible]ము, [illegible]ము ... | 0 | 12 |
| [illegible] కాలికోబైండు ... | 1 | 2 |
| డి[illegible] వేంకటనాథరా[illegible]కవికృ[illegible] ... | 1 | 4 |
| [illegible]వతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| [illegible]టో కాలికోబైండు ... | 0 | 14 |
| [illegible]తాపహ[illegible], చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| [illegible]త్తరఖండము ... | 1 | 0 |
| బిల్హ[illegible]యము, ఆ. [illegible]గారిది ... | 0 | 6 |
| భాస్క[illegible]మాయణ[illegible]ని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| భోజరాజీయము, [illegible]మాత్యకృతము ... | 1 | 2 |
| భోగినీదండకము, కోటీశ్వరకవివిరచితము ... | 0 | 8 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితముమీద స్ఫుటమైనఅక్షరములతో చక్కగ ముద్రించియున్నారము ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| డిటో కాలికోబైండు ... | 2 | 2 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు ... | 0 | 10 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 3 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | [illegible] |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

